# చిరుగజ్జెలు

## (నృత్యనాటికలు)





సంకలనకర్త

శ్రీ ఏడిద కామేశ్వరరావు

సమీక్షకులు

శ్రీ నటరాజ రామకృష్ణ

ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ

94/4 RT, బర్కత్‌పురా క్వార్టర్సు

హైదరాబాదు-500 027

# వి న తి

బాలలు మన హృదయాలు పూచిన పసిడిమొగ్గలు ఆ మొగ్గలునిగ్గుదేరి, వివిధ వర్ణాలతో విప్పారిన, పరిమళ శోభితమైన ఆమని వికసిస్తుంది ఆ ఆమని అమృతమయం కావడానికి పాటుపడే కృషీవలులం మనం ఆ కృషి ఎంత పవిత్రమైనది! ఎంత ఆనంద కరమైనది! అదే బాలానందం! అదే బ్రహ్మానందం!

పూజ్య బాపూజీ వంటి పవిత్ర భావుకుల భావన లివి ఆ భావనలే మన బాలల అభ్యుదయ కార్యక్రమాలకు కరదీపికలు అవుతున్నవి

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ అవతరించినదాదిగా, ఈ ఆశయ సాధనకే అహరహమూ కృషి చేస్తున్నది విద్యా, సాంస్కృతిక, కళా, వైజ్ఞానిక రంగాలలో బాలల మనోవికాసానికి తోడ్పడుతూ వారిలో అజ్ఞాతంగా వుండే కళాభినివేశ లకు ప్రేరణకల్పించే చర్యలను చేపట్టి, బాలల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయడమే ధ్యేయంగా బాలల అకాడమీ పని చేస్తున్నది

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా, బాలల అకాడమీ చేకొన్న వివిధ కార్యక్రమాలలో "బాల వాఙ్మయ సంకలనాల' ప్రచురణ ఒకటి

బాల వాఙ్మయంలో ప్రముఖులగువారు సంతరించిన ఈ సంకలనాలు—నాటికలు, నృత్య నాటికలు కథలు, గేయాలు పొడుపుకథలు జీవిత చరిత్రలు వివిధ శాఖలకు చెందిన సంకలనాలు సంపుటాలుగా ప్రచురితములైనవి ఇది ఎంతో సంతోషింపదగిన విషయం

'చిన్నారి బాలలకు చిన్ని పుస్తకాలు అనే ఆశయంతో వెలువడుతూవున్న ఈ పుస్తకాలు బాలల నలరించగలవని ఆశిస్తూ—ఈ కార్యక్రమం ఫలప్రదం కావడానికి సహకరించిన వారందరికీ నా అభివాదాలను తెలుపుతూ వున్నాను

ఇట్లు,
టి హయగ్రీవాచారి,
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

హైదరాబాదు
14 నవంబరు, 1979

# సమీక్ష

అంతర్జాతీయ బాలల సంవత్సరములో, బాలల అకాడమీవారు, భావి భారత పౌరులు— తెలుగు బాలల నిమిత్తం బాలసాహిత్యంలో భాగంగ గేయ నృత్య నాటికలను పుస్తకరూపంలో అచ్చువేయుట ప్రశంసనీయము.

ఆడుతూ పాడుతూ మనదేశచరిత్ర సంస్కృతిసౌభాగ్యాలను అర్థం చేసుకోడానికి బాలలోకంలో ప్రచారం చేయడానికి యీ నృత్య గేయ నాటకాలు యెంతగానో వారికి ఉపయోగపడగలవు.

పూర్వం బాలలకొరకు పెద్దవారు గేయ నృత్య నటకాలు ప్రదర్శిస్తూ మన ప్రాచీన సంస్కృతిని ప్రచారం చేసేవారు. ఆ రచనలు నీతి ప్రబోధకాలుగా ఉపకరించిననూ ఆ భాష, అందలి భావవికాసము తీరు, చిరుతప్రాయంలో వున్నవారికి అందుబాటులో వుండుట అరుదని చెప్పవచ్చును.

ఆ లోటునుతీర్చి వారికి అర్థమయ్యే భాష, వారు అతిసులభంగా పాడుకోవీలైన రాగ ఛందస్సులందు అనేకమంది కవులు రచనలు చేసినారు. అందు అనేకములు బాలల కళాలోకంలో విరివిగా ప్రచారం జరిగినవి. అట్టి రచనల్లో కొన్ని ముఖ్యమైన వాటిని ఏరి కూర్చి రూపొందించిన పుస్తకమే యీ సంకలనము.

అట్టి కళా రచనల్లో కవులు, రచయితలు కొన్ని యిబ్బందుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. కథావస్తువు, ఆ కథను కూర్చేవిధము, అందుకు తగినభాష, అందలి భావాన్ని ఆ చిన్నారులకు అర్థమయ్యే రీతిని పాడుకోడానికి వీలైన పద్ధతిని నృత్యమాడడానికి అనుకూలించే విధానము చిన్నచిన్న మాటల్లో పొదగడం చాలా కష్టము. దీనికి కొంత ప్రత్యేక కృషి చేయవలసివుంటుంది.

ఈ పుస్తకంలో కొన్ని నృత్య గేయ నాటికలువున్నవి. ఈ రచనలు చేసిన వారందరూ సమర్థులైన కవులు. ఈ రచనల్లో చాలామట్టుకు యిదివరకు రేడియోలోను, రంగస్థలంపైన ప్రదర్శనలు చేయబడినట్టివి.

ఈ రచనలు ముద్రించుటతోపాటు బాలల అకాడమీవారు ఈ నాటికల సంగీతన్ని గూడా 'టేపు' చేయించి వుంచిన, ఈ రచనలు ప్రదర్శించాలని అభిలషించిన బాలానంద సంఘాలకు చాలా ఉపయోగముగా వుండును. అంతేగాక బాలల అకాడమీ తరపున కొన్ని బృందాలకు ఈ నృత్యనాటికలందు శిక్షణనిప్పించి ప్రదర్శనాలు జరిపించిన అకాడమీవారి కృషి సంపూర్ణంగా ఫలించగలదు.

మొదటిసారిగా బాలల అకాడమీ తరపున యిట్టి ప్రయత్నం జరుగుట చాలా అవసరము.

సెటురాజు రామకృష్ణ

17-10-1979,
హైదరాబాదు-20

# నా మాట

ఆంగికం యస్య భువనం
వాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది
తం సాత్వికం వందే శివం॥

భావ రాగ తాళయుక్తమైన భరతనాట్యాన్ని నాట్యకళకు అన్వయించి రసోద్దీపనం చేయడమే 'నృత్యనాటిక'ల హృదయం'

లలితకళలన్నిటినీ తనలో యిముడ్చుకొని రసాధిదేవతగా సాక్షాత్కరించే ఈ కళ ఈనాటిది కాదు। యక్షగానాలుగా అవతరించి, యుగయుగాలనుండి తరతరాలకు అనుశ్రుతంగా ప్రవర్తిల్లుతూవున్న ఈ రసప్రక్రియ - సర్వకాలాలలోను సకలజనా రంజకంగా భాసిల్లుతూవుంది

కళలు క్రొంగొత్త రీతులను దిద్దుకొంటూవున్న ఈరోజులలో - కళాభిమానులకు వున్న ఉత్సాహానికి తగినంతగా నృత్యనాటికలు (రచనలు) వెలువడివుండలేదు ఇందుకు కారణం ఉత్సాహలోపం అనడానికి వీలులేదు నృత్యనాటికలను ప్రదర్శించడానికిగల వ్యయప్రయాసలే ముఖ్యకారణమని - కొందరు చెప్పేమాటలు యథార్థములే అనిపిస్తుంది

ఏది ఏమైనా - నృత్యనాటికలుగా వినియోగపడే రచనలు చాలా తక్కువగానే వెలువడినవి పెద్దలు ప్రయోగించుకొనగలిగినవే స్వల్పమైవుండగా, పిల్లలు ప్రదర్శించు కొనదగిన రచనలు తక్కువలో తక్కువ అవడం అత్యుక్తికాదు

అయితే నృత్య నాటికలను గేయ నాటికలను ప్రదర్శించే వారిలో పిల్లలే ఎక్కువ పాఠశాలలలోను బాలల సంఘాలలోను ఉత్సవాల సందర్భంగా తరచు పిల్లలచే కొన్ని నృత్య, కళ క్రీడలు ప్రదర్శితములవుతూ వుంటాయి అలా ప్రదర్శితము లయ్యే నాటికలన్నీ పిల్లల కోసం రచించినవేనా? అంటే తృప్తికరమైన సమాధానం రాదు

— పిల్లల ఉత్సాహానికి పెద్దలు తగిన అవకాశాలను అందించినట్లయితే, వారి కళా క్రీడలు నిజంగా ఆనంద స్ఫోరకములవుతవి

ఇట్టి ఉద్దేశంతో కొందరు ప్రముఖులు రచించిన కొన్ని నృత్య నాటికలను ఈ సంకలనములో సంతరించడం జరిగింది అయితే, ఇందున్న రచనలన్నీ పిల్లల కోసం రచించినవే నని చెప్పడం నా అభిమతం కాదు - క్రమబద్ధము, విధాన

విహితము, శాస్త్రానుగుణము అయిన రచనలను కొన్నింటిని పిల్లలకోసమని మాత్రం సంకలనంచేసిన ప్రయత్నం మాత్రమే ఇది।

నేను సేకరించ గలిగిన వాటిలో కొన్ని మాత్రమే ఈ సంపుటములో వెలువడినవి ఇంకా మరికొన్ని తదుపరి సంపుటాలలో వెలువడగలవు నాకు తెలియని రచయితలు, రచనలు – ఇంకా ఎందరెందరో వుండవచ్చును యథావకాశాన్ని బట్టి అట్టివారి రచనలను కూడా ప్రచురించడానికి తగిన ప్రయత్నం జరుగుతుందని విశ్వసిస్తున్నాను

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ వారు 'నృత్యనాటికల ను సంకలనం చేసే అవకాశాన్ని నాకు కలుగజేసినందుకు వారికి నా కృతజ్ఞతాభినందనలను తెలుపు కుంటున్నాను ఈకృషిలో నాకు తోడ్పడిన మిత్రులకు నా కైమోడ్పులు

ఏడిద కామేశ్వరరావు
( సంకలనకర్త )






పాత్రలు

రామం

సీత

జలధరం

చంద్రుడు

పవనుడు

రంగాలంకరణ

రంగస్థలంపైన చంద్రబింబం కనపడుతూ వుండాలి రంగస్థలమంతా వెన్నెల నీలికాంతి నిండి వుండాలి తీర్చిదిద్దిన తోటలా- పూలమొక్కలు పూలతీగలు, తిన్నెలు వుండాలి

(కార్తీక పౌర్ణమినాడు పొన్నచెట్టు ప్రక్కన సాయంత్రం ఏడున్నరకు
చంద్రికాపురం పిల్లలంతా చేరి పాడుతూ ఆడుకుంటున్నారు)

మడుగులు మడుగులు, వెన్నెల మడుగులు
మెత్తని చుక్కలు ఎత్తిన గొడుగులు ॥మడు॥

కలువ పూవులకు విలువలు కూర్చిన
కర్పూరంతో కలసిన తొడుగులు ॥మడు॥

చందమామతో సాగిన మబ్బులు
చల్లగ జార్చే చక్కని పిడుగులు ॥మడు॥

తారకలన్నీ చేరి ఆడగా
నేలకు జారిన నీడల పొడుగులు ॥మడు॥

పల్లని లోకం నానా దిక్కుల
దేవుడు నడచిన తెల్లని అడుగులు ॥మడు॥

దిశాకన్యకలు నిశాదేవికై
నేత చీరల పేకలు పడుగులు ॥మడు॥

(పిల్లలంతా పాడుతూ ఆడుతూ వుండగా జలధరం ప్రవేశిస్తాడు
కంఠం బొంగురుగా కాస్త భయంకరంగా ఉంటుంది)

అరే పిల్లలూ! ఒరే ఎల్లలూ!
ఒహో ఎల్లలూ! అహో ఎల్లలూ!
జరగండోహో! జరగండోహో!
కన్నులు గానక వెన్నెలతోటి
ఎన్నినాళ్ళుగా ఆడేస్తున్నారోహో
వెన్నెలలంటే ఏమిటో తెలుసా?
తెల్లని పాములు నాగుంబాములు
పాములతోటి ఆడేరంటే
ప్రాణం దక్కదు ప్రాణం దక్కదు
పామును చంపి మీ ప్రాణాలను

కాపాడేస్తా మిమ్మాడిస్తా
ఛూఛూ మంత్రం యంత్రం జంత్రం
మంత్రం తంత్రం యంత్రం జంత్రం
పాము చచ్చెరా పాము చచ్చెరా
పుచ్చె విచ్చెరా పుచ్చె విచ్చెరా

(జలధరం చేయి విసరేటప్పటికి వెన్నెల మాయమై పోతుంది అంతా చీకటి ఎల్లలంతా ఆరాటంతో వెన్నెలను వెతుక్కుంటుంటారు వాళ్ళంత జలధరంయొక్క చీకటి జుట్టులో చిక్కుకోపోతారు)

అయ్యో! అయ్యో! చీకటి చీకటి
కుయ్యాలించే వారేలేరా!
ఇంటికి పోయే దారేలేదా!
కంటకాలలో పడి చావాలా!

(ఎల్లలంతా విచారంగా పాడతారు)

అన్ని ముబ్బులు, అన్ని దుబ్బులు
అలసించితే ఇంట్లో దెబ్బలు
అక్కలు! అన్నలు! ఎటు పోదాము
చిక్కుకుంటిమి చీకటిలో

రామం ఎన్ని కష్టాలొచ్చెనే చెల్లెలా మనకు?
ఇల్లుదారే తోచదే! చత్తుమా? కొనకు? ॥ఎన్ని॥

(పిల్లలంతా విదారంగా ఈ పల్లవిని మళ్ళీ మళ్ళీ పాడతారు)

రామం దయ్యాలవలె తలలు విరబోసకొని మబ్బు
కయ్యాలకై కాలుదువ్వుతూ వస్తోంది ॥ఎన్ని॥

సీత ఎన్ని కష్టాలొచ్చెరా అన్నయా మనకు?
ఇల్లుదారే తోచదే చత్తుమా? కొనకు?
అందాల మన భూమి అడుగునే పోయింది ॥ఎన్ని॥

రామం ఓరి జలధరా! పసిపిల్లలపై
క్రూరత్వం చూపిస్తావా!
తెల్లని వెన్నెట్లో ఆడుకునే
పిల్లల చీకట్లో తోస్తావా!

సీత దయలేదా మాపై!
భయపెడతావా పాపీ!

రామం భయపడకే ఓ సీతా!
జయం మనదనీ నమ్మండి
అక్కల్లారా! అన్నల్లారా!
కలసికట్టుగా ఉండండి!

సీత నీళ్ళలోపలా ఈదిన మాదిరి
నీలి మబ్బులో ఈదండి!
జలధరు గుండెలు చెండండి
కలసికట్టుగా ఉండండి!

జలధరం ఇంతలేసి మీరెంతవారని
ఎంతో అల్లరి చేస్తున్నారు
వెన్నముద్దలా బాలలను
కన్నులు మూసి మింగేస్తాను

రామం మింగేస్తావా మమ్ములను?
దొంగా! ఈ పసి బాలలను?

సీత పిల్లల పాపల బలిగొంటావా!
పిశాచమై మము మింగేస్తావా!

(ఎల్లల కేకలు, అరుపులు)

రామం భయపడకండీ బాలల్లారా!
జయం మనదనీ నమ్మండర్రా!

అందర మొకటై ఉందాము
అపాయమును ఎదిరిందాము

(జలధరుని వికటాట్టహాసం)

సీత భయమవుతున్నది రాము
పాపిని ఎదిరించలేము

రాము చల్లని వెన్నెట్లో ఆడుకునే
పిల్లల మ్రింగే పాపిని గెలిచి
బాలలోకమును మెప్పింతాం
పాల వెన్నెలను రప్పింతాం

జలధరం పాలబుగ్గల పాపల్లారా!
వజవజ వణికే దీపాల్లారా!
జలధరుణ్ణి ఎదిరిస్తారా?
బలవంతుని భయపెడతారా?
జాబిల్లిని మింగేశాను
వెన్నెలను తాగేశాను
నల్లనల్లటి నా జడలల్లో
పిల్లలను బంధించాను
ఇంకెక్కడికి పోతారర్రా!
ఇంకెవ్వరితో చెబుతారర్రా!

(పిల్లల ఏడ్పులు, అరుపులు, కేకలు)

పవనుడు ఆకాశంలో పిల్లల అరుపులు
ఈ సమయంలో ఎక్కడివి
నేలపైన గల ఈ బాలలు
నింగిలో కెలా వచ్చారు?
పాపల్లారా! పసిపాపల్లారా!
ఏడుస్తున్నా రెందుకని!

కిలకిలనవ్వే కళకళలాడే
మీలో అలజడి రేనికనీ!

సీత నల్లని జడగల రాక్షస
పిల్లలను కట్టేశాడు

రామం ఎత్తుకు పోతున్నాడు
మొత్తుకున్నాగాని వినడు

సీత చల్లని వెన్నెట్లో ఆడుకునే
పిల్లల నెత్తుకు పోతున్నాడు

రామం వీడిపేరు జలధరుడు
పిల్లలపాలిటి రాక్షసుడు

పవనుడు జలధరు జడలో చిక్కారా!
అలమటించుతూ వున్నారా!
జలధరు గుండెలు చీలుస్తా!
బాలల నిపుడే విడిపిస్తా

(తుఫాను గాలి వీచిన దప్పుడు-పిల్లలంతా ఆనందంగా నవ్వుతుంటారు)
(జలధరుడు - కేకలువేస్తూ అరుస్తూ కుంభకర్ణుడిలా కూలిపోతాడు)

పవనుడు పాపల్లారా! భయపడ్డారా?
పాపి జలధరుని చేతిక్కారా?
చల్లని వెన్నెలలో ఆడుకునే
పిల్లల చంపగ చూశాడే

సీత పవనుడు మామయ్యకు జై జై
పవనుడు మామయ్యకు జై జై

పిల్లలంతా పవనుడు మామయ్యకు జై జై
పవనుడు మామయ్యకు జై జై

ఎన్నల మడుగులు

**రామం** నల్లని మబ్బులు విడిపోయాయి
తెల్లని వెన్నెలలే వచ్చాయి
కన్నుల పండువుగా మీరంతా
వెన్నెల పండగ చేయండి

**పవనుడు** చందమామకూ మీకూ శత్రువు
గందరగోళం లేపినవాడు
జలధరుడెన్నడు మళ్ళీ రాడు
జాలిలేక మిమ్మెత్తుకు పోడు
భయపెట్టేవా డెవ్వడొచ్చినా
పవనుడు మామను పిలవండి
తుఫానులా నేనొస్తాను
దుష్టుల- తునకలు చేస్తాను

**సీత** నువ్వుంటే మాకేమి భయం

**రామం** యెవ్వడినైనా ఎదిరించగలం

**పవనుడు** బాలలందరికి జయం జయం
బాలలు నాకు ప్రియం ప్రియం

**సీత** పవనుడు మామకు జేజేలు

**రామం** చందమామకూ జేజేలు

**చందమామ** నాకూ మీకూ జలధరుడు
అపకారం చేశాడు
పవనుడు మామ వచ్చాడు
పాపలను కాపాడాడు
పవనుడు లేని చోటేలేదు
పవనుడుంటె ఇక లోటేలేదు

పవనుడు    పాపల-బాధలు పెట్టేవారి
ప్రాణాలను తీసేస్తాన
అవసరమైతే నను పిలవండి
అరక్షణంలో వస్తాను
నా రెక్కలపై ఎక్కించుకునీ
ఎక్కడికంటే అక్కడికీ
తీసుకుపోయీ బాలలను
తేలుస్తాను ఆనందంలో
బాలలు నాకు దేవుళ్ళు
బాలల ఆజ్ఞే నా గుళ్ళు

ఎల్లలు    పవనుడు మామయ్యా!
బతికించావయ్యా!
రాక్షసునీ చంపి
రక్షించావయ్యా!
నీ రెక్కలమీదా - మ
మ్మెక్కించావయ్యా!
వెన్నెల మడుగులలో
ఆడించావయ్యా!
చీకటి గుండెలకు
చెండేశావయ్యా!

(ఆనందంగా నవ్వుతాడు పవనుడు)

సీత    వెన్నెల మడుగుల్లో
స్నానాలాడండి

రామం    వెన్నెల గొడుగుల్లో
వెచ్చగ వుండండి

సీత    వెన్నెల జండాలు
ఎగిరేయండి

వెన్నెల మడుగులు

| | |
|---|---|
| రామం | వెన్నెల పాయసము<br>తాగేయండి |
| సీత | వెన్నెల బొమ్మలతో<br>ఆటాడండి |
| రామం | వెన్నెల దీపాలూ<br>వెలిగించండి |
| సీత | వెన్నెల మేడల్లో<br>పవళించండి |
| రామం | వెన్నెల ఉయ్యాల<br>ఊగేయండి |
| సీత | వెన్నెల చక్రాలూ<br>విసరేయండి |
| రామం | వెన్నెల మతాబులూ<br>వెలిగించండి |
| సీత | వెన్నెల లడ్డూలూ<br>భోంచేయండి |
| రామం | వెన్నెల పల్లకిలో<br>విహరించండి |
| సీత | వెన్నెల పువ్వులనూ<br>విసరేయండి |
| రామం | వెన్నెల మడుగులు మడుగులూ |
| సీత | వెన్నెల గొడుగులు గొడుగులూ |

రామం వెన్నెల తొడుగులు తొడుగులూ

సీత వెన్నెల అడుగులు అడుగులూ

అంతా వెన్నెల మడుగులూ
చీకటి గుండెలలో
చిచ్చర ఎడుగులూ
వెన్నెల మడుగులూ






పాత్రలు :

రాము

సోము

మరికొందరు పిల్లలు

భీమయ్య

తోటతల్లి

రంగాలంకరణ

రంగంపై- పూలచెట్లు, పూవులు- పూలతోట వాతావరణం

కోరస్ పిల్లలార రారండి
వీర వీరాన చేరండి
తోటలోని పూవులతో
ఆటలాడ రారండి

తెమ్మెరలా పయనించి
తీగెల్లా నటియించి
తేనెవోలె పూవుపూవు
లోన దాగి శయనించి
లేత వయసు లున్నపుడే
లేచిలేచి కదలండి
పసకోరక తీనాలే
పల్లవించ రారండి

ఆకులలో సున్నని పూ
రేకులలో నివసించి
తుమ్మెద గీతమ్ముల నా
దమ్ములలో రవళించి
కమ్మని వాసనలెన్నో
గంపలలో నింపండి
సన్నని క్రొన్నన వన్నెల
సంచులలో దింపండి
పిల్లలార రారండి
వీర వీరాన చేరండి

పిల్లలు అడుగడుగో తోటతల్లి
మనపాలిటి పాలవెల్లి
రమ్మని పిలిచెను గదరా
రామూ సోమూ పదరా

రాము తమ్ములార! మనమంతా
తప్పక వెళ్ళాలిరా

ఆటలతో పాటలతో
పూటలు గడపాలిరా

సోము ముందు ముందుగా దాగుడు
మూతలె ఆడాలిరా
పిమ్మట పాటలతో తల
దిమ్మును వీడాలిరా

పిల్లలు ఆటపాటలైనాక
అలసి పోవునందాక
చిన్న చిన్ని పాపలతో
వెన్నె పూలజాలలతో
మనసుదీర మమతలూర
మాటలాడుదమురా
మంచి మంచి కథలను మన
మంటి విందామురా

(తోటలోకి వెళ్తారు)

తోటతల్లి పిల్లలార రారండి
బిరబిరాన చేరండి
అల్లరి చేయక రండి
ఆనందించగ రండి

అందమైన పూరేకుల
కందిపోనీకండి
పసరుటాకులను చేతుల
పిసికి వేయబోకండి

కొందరే పూలన్నిటినీ
అందుకొనుట తగదండి
అందరూ సమానంగా
అనుభవించ వలెనండి

పిల్లలు నీ మాటల తలదాలిచి
మేము చరిస్తామమ్మా
నీ చూపుల నీడల్లో
నే విహరిస్తామమ్మా

తోటతల్లి ఎవరికి తోచిన ఆటల
వారు వినోదించండి
ఎవరికి తోచిన వింతల
వారు విలోకించండి

(పిల్లలు తలా ఓ పువ్వును ఏరుకుంటారు)

రాము వింత వింత రంగులతో
బంతిపువ్వు నవ్వెరా

సోము కమ్మ కమ్మ వాసనలను
గడుసుమల్లె రువ్వెరా

3 వ పిల్లవాడు నిండుగా హసించిన రా
ణీ గులాబి పిలిచెరా

4 వ పిల్లవాడు నాట్యమాడు పొన్నకన్నె
నన్ను జూచి నిలిచెరా

5 వ పిల్లవాడు పొగడ మగువ మొగము చూడ
పొగడ మనసు కలిగెరా

6 వ పిల్లవాడు మొగలి మొగ్గలోని తలపు
మోవి విప్పి పలికెరా

7 వ పిల్లవాడు మాలతీ లతాంగి తీయ
మాటలు వినిపించెరా

8 వ పిల్లవాడు పారిజాత భామ తేనె
పాటలు పలికించెరా

పిల్లలు పూలవోలె మనమంతా
పొంగి నటించాలిరా
గడియలోన దినమంతా
వడిగ ముగించాలిరా

(భీము కోపంగా ప్రవేశిస్తాడు)

ఆగండ్రా కుర్రల్లారా!
ఆడేపాడే కుంకల్లారా!
తోటల్లోన తిరగొచ్చారా
దొంగల్లాగా చొచ్చారా

ఎవ్వరి సొమ్మనుకున్నారు?
పువ్వులలో నిలుచున్నారు
తీవెల కదలిస్తున్నారు
తావుల పీలుస్తున్నారు

రాము అయ్యా దొరకొడుకా - భీమయ్యా!
అంత కోపమైతె ఎట్లాగయ్యా
మా విన్నపమే వినవయ్యా
మేము దొంగలం కామయ్యా

భీము ఔరా! కళ్ళకు కొవ్వెక్కింది
ఎవ్వడురా రమ్మని పిలిచింది?
ఇల్లూ వాకిలి లేక మీరూ
చల్లని తోటను శరణన్నారూ

సోము ఇల్లూ వాకిలి లేదనుకోండి
తల్లిదండ్రులు లేరనుకోండి
అయినా పిలువందే రాలేదు
ఆత్మ గౌరవం నశింపలేదు

భీము మారు పల్కడం నేర్చారింకా
పెద్దలముందూ జడుపా జంకా?

సిగ్గులేక నిలుచున్నారా?
చేటు మాట లంటున్నారా?
పూవులపైనా తీవెలపైనా
పొంగిన తీయని తేనెలపైనా
ఆకులపైనా రేకులపైనా
అంతట నాదే అధికారం
నాదే నాదే అధికారం

రాము భూమాతకు మీరొకరే
పుట్టి పెరిగినారా?
అందరామె ఆదరమ్ము
అందుకొనగలేరా?

భీము నోరు మూయరా కుర్రా
మేరమీరి ప్రేలెదవా
ఊహించావా? భీముని
ఎదురుగ నిల్చున్నావని

అడ్డమైన దద్దమ్మల
కధికారం కావాలా?
ఎన్నడు దొరకని హక్కులు
ఈనాడే రావాలా?

మాటలతో వింటారా
కొరడా తెమ్మంటారా
తిరిగి పారిపోవుదాక
విరగ బాదమంటారా

(ఛెళ్లున కొరడాదెబ్బలు)

పిల్లలు అబ్బా! భీముని కొరడా
దెబ్బ లోర్వలేమమ్మా!

తోటతల్లి

బాధలతో ఈ బానిస
బ్రతుకు నీదలేమమ్మా!

(పిల్లలందరూ పారిపోతుంటారు)

తోటతల్లి — చిగురులార! మీరిట్లా
వెరిచి పారిపోకండి
చీకటి తర్వాత వెలుగు
రేకలు వస్తాయండీ

ఒక్కరిదే అధికారం
ఉండబోదు కలకాలం
భీముడెంతో మీరంతే
మీరెంతో భీముడంతే

అందరొకే వేదికపై
ముందుగ గుమిగూడండీ
పిమ్మటగానీ భీముని
పీచమణగ గొట్టండి

రాము-సోము — తమ్ముళ్లార రారండీ
దగ్గరగా చేరండి
రక్కసి గుండెల భీముని
చిక్కబట్టి కదలండీ,

కదలండీ కదలండి
అదరు బెదరు వదలండీ
సమతా ఫల సాధనకై
సాహసించి నడవండి

(పిల్లలంతా కలిసి భీముణ్ని చిక్కబట్టుతారు)

భీము — అమ్మయ్యో! కుర్రకుంక
లంతా పోగయ్యారే

చివరికి కొరడా లాక్కొని
చిక్కబట్టినారే

రాము వెధవ కుర్ర లనడమింక
విడువలేద భీమయ్యా?
చింత చివికి చచ్చిననూ
పులుసు చావలేదయ్యా

భీము బాబులార! ఎన్నాళ్ళని
బందిఖాన నుంటాను
వదలండీ! వచ్చె బుద్ధి
లెంప లేసుకొంటాను

పిల్లలు వదలినాము పోవయ్యా
బుద్ధిగలిగి ఉండయ్యా
మానవులు సమానులనే
మాట మరవబోకయ్యా!

తోటతల్లి పిల్లలార రారండి!
బిర బిరాన చేరండి!
తోటలోని పూవులతో
ఆటలాడ రారండి!

పిల్లలు ఇదుగిదుగో తోటతల్లి
మన పాలిటి పాలవెల్లి
రమ్మని పిలచెను గదరా
రామూ సోమూ పదరా




పాత్రలు

1 ఆడ ఎలుక (గర్విష్టి)
2 మగ ఎలుక (రాజు)
3 సూర్యుడు
4 మేఘుడు
5 వాయువు
6 కొండలరావ
7 8 చిట్టెలుకలు

ఈ నాటికకు కావలసిన వస్తువులు

1 ఎలుక మూతులు నల్లని కాగితం మిఠాయి పొట్లం మాదిరిగా చుట్టి, కళ్ళదగ్గర గుండ్రంగా కన్నాలు కత్తిరిస్తే, ఎలుక మూతులు అవుతాయి

2 ఎలుక తోకలు సన్నని వంగే తీగెలకు నల్ల గుడ్డపేలిక గాని రిబ్బనుగాని చుడితే తోకలవుతాయి ఆ తోకలను నడ్డికి కట్టాలి

3 కిరీటం-ఎలుక రాజుకి [అట్టది చేయవచ్చును]
4 సూర్య కిరణాలను సూచించే కిరీటం [సూర్యుడికి]
5 నీలిరంగు కిరీటం [మేఘునికి]
6 నైలాన్ ఉత్తరీయం [వాయువుకి]
7 కొండ శిఖరాల్లాగా కత్తిరించిన కిరీటం [కొండల రావకి]
8 కొండల స్వయంవరానికి రెండు పూలమాలలు
9 దుస్తులూ, ఆభరణాలూ, ఆయా వేషాలకు తగినట్టుగా వుండాలి

[వెనుకన అడవీ, కొండలూ సూచించే తెరగాని, లేకపోతే నీలివర్ణం తెరగాని వుంటే బాగుంటుంది]

[తెర ఎత్తగానే నేపథ్యగానం]

ప్రయోక్త సాకీ (ఇది తాళంతో ఉండదు)

సససససా రిగను పప పా
అనగనగా అడవి ప్రక్క

పదప పదపపా - పదపద పదపా పదపదపా
కొండ దిగువునా - అ

పాద పమమ - గమగరిరిరి సరిగ రిససా
ఆడు ఎలుక - అతిరయముగ - అలరుచుండెనూ

ససా,, - గగా,, - పపా, - మమా - రిరీ,, - ససా,,

(ఆడ ఎలుక గర్వంతో ఒయ్యారంగా ప్రవేశం)

[ఈ తరువాత సాకీ కూడా పైదానివలెనే పాడుకోవలెను]
ప్రయోక్త

పొలములోని వడ్లు పైర్లు - అన్ని తినుచూ
పొగరు తనము హెచ్చి మదిని - ఇట్లు తలచెనూ

[ఆడ ఎలుక నేలమీద వడ్లు తింటున్నట్టు నటించి, గర్వంగా తల ఎత్తి, నేపథ్య గానానికి సరిగా అభినయిస్తుంది]

(ఆడఎలుక పాట)

MUSIC I త్రిశ్రగతి - శంకరాభరణ రాగంలోని స్వరాలు

, ససస, రిరిరి, గగగా, మమమా,
పామగామ పామగామ పామగారి సససా

పాట సా, - పపప - పా, - ,, ॥
నా - అందమూ -

సా - దదద - దా, -,, ॥
నా - చంద - మూ - - ॥

పాద - పామ - గామ - గారి ॥
నన్ను - మించు - వారు - లేరు

సా, - రిగమ - పా, - ,, ॥
నా - కులము - నా - - ॥

పదప - పదప - పదప - పదప
తిరిగి తిరిగి వెతకి వెతకి

తకిట తకిట తకిట తకిట (తబలాసోలో)
పదప - పదప - పదప - పదప
తిరిగి తిరిగి వెతకి వెతకి

పదప మామ గమగ రిరి ॥
పుడమి లోని ఘనుని పట్టి ॥

సాస - రిగమ, - , ॥
పెండ్లి యాడెదన్ - ॥

(అని పాడి, మళ్ళీ తన అందాన్ని తలచుకొని)

సా - పపప - పా, -,,
నా అందమూ

సా - దదదదా, - ,, ॥
నా చందమూ

పా, - ససస - సా - ,,
నా - అందము

పా, - ససస - సా
నా, - అందము

(Fade out)

[ఎలుకల రాజు ప్రవేశము]

బాకా పసా పసా,,, । పసా పసా ,,

MUSIC II చతురశ్రగతి

(స్వరానికి క్రింద - ఈ గుర్తు వుంటే అది కైశికినిషాదం లేదా సాధారణ గంధారం)

గమపద - పా మ - గమపద - పా,।
గమపద - మపగమ రిగసా - గా,॥

పాట గమ ప ని - దపపా -, గామ - పాపమ
ఎలుకా - ఎలుకా - చుడ - వే మన

గమ పని - దపపా - గామ - పా, ॥
కులముకు నే - నే - రాజు - నే ॥

MUSIC III మగ మప మగరీ రిగరిగమా (రెండుసార్లు)

పాట మగమప - మ గ రి - రిరిగమా
అందం - చూ - చీ మెచ్చానే

మగమప మ గ రి రిరి గ మా,
ని - న్నే - కో - రి - వచ్చానే

(నీ అందం చూచీ Repeat)

సా । స పపప - పా, ద - పామాగా సా
నా । చేయిని - పట్టు - కుంటావా నా

సరిరిరి - రిమ గ రి - రిససాసా, ॥
పట్టపు - రాణివి - అవుతావా ॥

(ఆడఎలుక - వచనం లాగ రివితో)
పోవోయ్ । పోవోయ్ । నీదారి

ఐ హావ్ టు సే వెరి సారీ
I have to say "Very Sorry"

తబలా తకధిమి - తకధిమి తక
తరికిట తరికిట తోం - తరికిట తరికిట తోం
తరికిట తరికిట తోం॥

గమప ని - దపపప - మగమపపా,॥
ఇలలో - ఘనుడుని - వెదికెదనూ॥

గమప ని - దపపప - మగమపపా, ॥
వానిని - పెండ్లి - ఆడెదను

పాపప - మామమ - గాగాగా,
పోవోయ్ - పోవోయ్ - నీదారి

మామా గాగా - సాసా - సా,
పోవోయ్ - పోవోయ్ - నీ దారి, ॥

(ఎలుకరాజు నిరాశతో వెళ్లిపోతాడు)

ఎలుకమ్మ గర్వంగా

MUSIC I వరెనే

పాట నా అందము నా చందము
నన్ను మించు వారు లేరు
మా కులమునా ।
నా అందము - నా చందము

(Fade out)

[సూర్యుడు ప్రవేశం]

తబలా తకిట తకిట తక - తకిట తకిట తక

MUSIC IV

మా, గా, రీ, సారీ। గారి సాధాసా, ॥
మమమా - గగగా - రిరిరీ - ససనరి।
గగగా - రిరిరీ - సససధ - సా, ॥

[సూర్యుని చుట్టూ నృత్యం చేస్తూ ఎలుకమ్మ పాట]

రిమమమ - మామగ రిగగమ - గరిసా॥

పాట సూర్యుడు బావా - సూర్యుడు బావా॥

సరిరీ -, రిమగ - రీ, సాసని। సరిరీ- రిమగరీ,
పెండ్లి - చేసు - కో నన్ను । పెండ్లి చేసుకో

Instruments సానీ। సారీ, రిమగరీ, సానని సారీ, రిమగరీ,,,

పాట రిపపప - పాపమ - పదనిస ని దపా।

అందరి - కంటే - ఘుఘడవు - నీవు
అందరి - కంటే - వీఘడ - వీవు।

రిపపప - పాదప - మాపమ - గరిసా
నిన్ను నేను ప్రేమిం - చానూ।

సరిరీ రిమగరీ, సనిసీ। సరిరీ రిమగరీ,,,
పెండ్లి చే సుకో, న న్నూ। పెండ్లి - చేసుకో,,

Instruments సనిసీ। సరిరీ, రిమగరి। సనిసీ సరిరీ, రిమగరీ॥

సూర్యుడు (పై చరణం వరినే)

ఎలుకా ఎలుకా వినవే ఎలుకా
తగనే నీకు భో - నేనూ
తగనే నీకు భో "

అందరి కంటే ఘనుడ ు కాను
అందరి కంటే వీరుడ కాను

పపపప - పాదప - మాపమ - గరిరి
నా కంటేనూ - మేఘుడు - ఘనుడు
నన్నూ కప్పి - చీకటి చేయును

మామమ - మామగ - రిగగమ - గరిసా-
మేఘుని - పోయీ - వేడు కొనుము

సరిరీ-, రిమగరీ, సాసని, సరిరీ, రిమగరీ,,
తగనే - నీకు పో - నేను| తగనే నీకు పో ,

వాద్యాలు సనిసీ సరిరీ, రిమగరీ, సనిసీ సరిరీ రిమగరీ

(Fade out)

[సూర్యుడు కాక పొమ్మన్నా, ఎలుకమ్మకి గర్వం తగ్గలేదు ఇంకా తన అందాన్ని తలుచుకుంటూ]

MUSIC I (మొదటి మ్యూజిక్ తిరిగి తిరిగి వస్తూ వుంటుంది, అది ఎలుక పాట ముందు)

పాట నా అందము - నా చందము
నన్ను మించు వారు లేరు
మా కులమునా - ॥ నా అందము॥

[మేఘుడు ప్రవేశం]

MUSIC IV Repeat అవుతుంది

(సూర్యుడు కానా - వరుసలోనే పాట పోవాలి)

ఆడ ఎలుక

పాట మేఘుడు బావా - మేఘుడు బావా
పెండ్లి చేసుకో నన్ను - పెండ్లి చేసుకో
అందరి కంటే ఘనుడూ సూర్యుడు
సూర్యుని కంటే పీడ నీవు
నిన్నూ నేనూ ప్రేమించాను
పెండ్లి చేసుకో నన్నూ పెండ్లి చేసుకో॥

[మేఘుడు సూర్యుడు పాడిన వరుసే]

ఎలుకా ఎలుకా వినవే ఎలుకా
తగనే నీకు ఫో - నేను
తగనే నీకు ఫో॥
అందరి కంటే ఘనుడను కాను
అందరి కంటే పీడను కాను

నా కంటే వాయువు ఘనుడు
గాలి వీచిన చెదిరి పోదును

వాయూ దేవుని - వేడూ కొనుమూ
తగనే నీకు ఫో - నేనూ - తగనే నీకు ఫో॥

[మేఘుడు వెళ్ళిపోతాడు]

(ఎలుకమ్మకి గర్వం తగ్గలేదు, ఆశ పోలేదు)

ఎలుకమ్మ పాట

MUSIC 1 (Repeat)

నా అందము - నా చందము
నన్ను మించు వారు లేరు
మా కులమునా॥ నా అందము

[వాయువు బావ ప్రవేశం]

తబలా Effect

MUSIC IV Repeat

ఎలుకమ్మ

వాయువు బావా! వాయువు బావా!
పెండ్లి చేసుకో - నన్ను పెండ్లి చేసుకో
అందరి కంటే ఘనుడూ సూర్యుడు
సూర్యుని కంటే ఘనుడూ మేఘుడు

మేఘుని కంటే ఘనుడవు నీవూ
మేఘుని కంటే - వీరుడ వీవూ

నిన్నూ నేనూ ప్రేమిం - చానూ!
పెండ్లి చేసుకో - నన్నూ
పెండ్లి చేసుకో "

వాయువు బావ

ఎలుకా ఎలుకా వినవే ఎలుకా
తగనే నీకు పో - నేనూ
తగనే నీకు పో "
అందరి కంటే ఘనుడను కాను
అందరి కంటే వీరుడ కాను

నన్నూ మించును పర్వతరాజు
పర్వతాన్ని నే కదల్చలేనూ

పర్వత రాజుని వేడూకోనుమూ
తగనే నీకు పో - నేనూ - తగనే నీకు పో॥

వాద్యాలు సనిసీ సారీ, రిమగరీ, సనిసీ సారీ రిమగరీ

(Fade out)

[ఎలుకమ్మ ఇంకా గర్వంగా]

MUSIC I (Repeat)

నా అందము - నా చందము
నన్ను మించు వారు లేరు
మా కులమునా ॥నా అందము॥

[కొండల బావ బరువుగా అడుగులు వేసుకుంటూ ప్రవేశం]

MUSIC IV (Repeat)

తరువాత తబలామీద ధీం, ధీం, అంటూ కొండలబావ అడుగుల effect

ఎలుకమ్మ

కొండల బావా కొండల బావా
పెండ్లి చేసుకో నన్నూ పెండ్లి చేసుకో
అందరి కంటే ఘనుడూ సూర్యుడు
సూర్యుని కంటే ఘనుడూ మేఘుడు
మేఘుని కంటే ఘనుడూ వాయువు

వాయువు కంటే ఘనుడవు నీవు
వాయువు కంటే వీరుడ వీవు

నిన్నూ నేనూ ప్రేమించానూ
పెండ్లి చేసుకో - నన్నూ - పెండ్లి చేసుకో॥

వాద్యాలు సనిసీ - సారి - రిమగరి సనిసీ సారి రిమగరి, ,, ॥

కొండల బావ

ఎలుకా ఎలుకా వినవే ఎలుకా
తగనే నీకు పో - నేనూ - తగనే నీకు పో
అందరి కంటే ఘనుడను కాను
అందరి కంటే వీరుడ కానూ

నన్నూ మించును ఎలుకల రాజు
కొండల దొలిచి - పిండిగ చేయును

ఎలుకల రాజుని వేడుకోనుమూ
తగనే నీకు ఫో - నేనూ - తగనే నీకు ఫో

వాద్యాలు , సనిసీ - సారీ - రిమగరీ, సనిసీ సారీ రిమగరీ, ,,

[ఎలుకమ్మ తన ఆశలన్నీ వమ్మయిపోయి నిరాశచెంది, ఆఖరికి ఎలుకల రాజే గతి అని విచారంతో పడిపోతుంది ]

(విచార సూచకంగా సంగీతం)

పా - గా - దా - సా - రీ - దా - సా

[ఎలుకల రాజు ప్రవేశం సంతోష సూచకంగా సంగీతం]

త్రిశ్రగతి

ససస రిసస ససస పా
ససస రిసస సస ప సా
గమపదపమ - రిగమపమగ -
సరి గ మ గ రి - ససస - సా
నినిని నినిని ససస ససస
నినిని నినిని ససస ససస
సీ,,, సా,, సీ , సా,,
నిసరిసనిస - నిసరిగమప
గమపదమప - గమరిగమా -
పపప పమగ - మమమ మగరి
గగగ గరిస - ససస సా॥

(మ్యూజిక్ నేపథ్యంలో వాయిస్తూ వు డగా)

(ఎలుకరాజు మెల్లగా ఎలుకమ్మ దగ్గరికి వెళ్ళి తట్టి లేపుతాడు ఎలుకమ్మ

లేచి ఎలుకరాజు చెయ్యి సిగ్గుతో ఒయ్యారంగా పట్టుకుంటుంది రెండు చిట్టెలుకలు స్టేజికి ఇరువైపుల నుంచీ ప్రవేశించి రెండు పూల మాలలు ఎలుకల జంటకి ఇస్తాయి ఎలుకలు పూలమాలతో స్వయవరం చేసుకుంటాయి )

బృందగానం

మా, గా, మా పా మా పా - పా, ని దాపామా,,,

ఆనంద మానంద మాయెనే
మా ఎలుకమ్మ పెళ్ళికూతు రాయెనే
మా ఎలుకయ్య పెండ్లికొడు కాయెనే

పని పని ససనస - నీ, సానీ దాపామా,

పేరంటానికొచ్చిన ఓ పిల్లల్లారా
పేరంటానికొచ్చిన ఓ పెద్దల్లారా
ఆనంద మానంద మాయెనే.

(–తెర–)






పాత్రలు

నాట్యబృందం I గొల్లభామ, పంతులు,
అభినవ కుమారుడు, నవకుమార్
సుకుమార్, అనసూయ, ప్రియంవద,
ప్రేమలత, ప్రిన్సిపాల్

రంగాలంకరణ

కొన్ని స్తంభాలు, కుర్చీ, బల్ల, గాంగ్,
కాన్వొకేషన్ సభా సంభారము

(తెర ఎత్తగానే ౮ గాని ౧౦ గాని స్తంభాలు - లోపల ఆడా, మగ ఎల్లు
నృత్యం చేస్తూ ఆడుతూ రంగస్థలం పైకి వస్తాయి )

1 బృందం కదిలి ఆడే స్తంభాలూ,
కదలక నిలిచే స్తంభాలూ,
నడిచీ వచ్చే స్తంభాలూ,
నలుగడ నిలిచే స్తంభాలూ

కొంటామిదిగో చల్లోయంటూ
కొనరే గొల్ల స్తంభాలూ

వరసలు తీరే స్తంభాలూ,
వంతులు మారే స్తంభాలూ
వసగులు పెట్టే స్తంభాలూ,
పక పక నవ్వే స్తంభాలూ

చెలిమిని కోరి చెంగున గెంతి
చేతులు మారే స్తంభాలూ

(ఎల్లలు పంటలు వేసుకుంటారు)

ఆటలు ఆడే స్తంభాలూ,
పాటలు పాడే స్తంభాలూ
చేతుల లోపల చేతులు చరచీ
పంటలు వేసే స్తంభాలూ

చల్లను అమ్మే గొల్లభామగా
చక చక మారే స్తంభాలూ

కాతలు పాతిన స్తంభాలూ
నేతలు మలచిన స్తంభాలూ
పౌర జీవితారంభాలూ,
రేపటి మూల స్తంభాలూ,
పిల్లలు నేడై పెద్దలు రేపై
సంఘపు మూల స్తంభాలు

(స్తంభాలను చతురస్రాకారంగా రంగంపైని నిలబెట్టి ఒక్కొక్క స్తంభాన్ని ఒక్కొక్క విద్యార్థి పట్టుకుని నిలబడి ఉండగా ఒక విద్యార్థిని గొల్లభామగా నృత్యం చేస్తుంది.)

గొల్లభామ    చల్లోయమ్మా, ఇదే చల్లోయమ్మా
ఎల్లారాకానందా మిచ్చేనమ్మా

బృందం    గొల్లాభామా, ఎంతావయ్యారివే
ఎల్లారకూ చల్లా పొయ్యారావే

గొల్లభామ    కానరారే యిదిగిదిగో కూరిమిచల్లా
ఊరక చూస్తారేమిదె ఓరిమి చల్లా

బృందం    గొల్లభామా, ఎంతా వయ్యారివే
ఎల్లారకూ చల్లా పొయ్యారావే

గొల్లభామ    కామధేనువు పొదుగూ కమ్మనిచల్లా
కావాలంటే యిదుగో పుల్లని చల్లా

బృందం    గొల్లా భామటువైపు
వెళ్ళంగా యిటువైపు
తేరి పారా చూచీ
బారా బారా చాచీ
ఒక్కాసారే వెయ్యి వయ్యారంగా
పక్కా స్తంభంచేరా ఒక్కా అంగా

గొల్లభామ    ఒక్కా స్తంభం విడిచీ
పక్కా స్తంభం గడిచీ
వెక్కిరిస్తూ నన్నూ
వెంటా పడ్డారంటే
చేతి కందిన వారే తలపైనంతా
చేరూ గొల్లాభామా చల్లముంతా

అంతా — స్తంభాలాటా నేడు స్తంభాలా-రేపు
సంఘంలో ప్రగతికి గుంజూలాటా

(స్తంభాలలో ఎల్లలు బైటకు వచ్చేస్తారు)

గొల్లభామ — ఒక్కొక్కరికీ ఉంది ఒక్కొక్క స్తంభం

బృందం — ఆమె తలపై ఉందీ చల్లా కుంభం

గొల్లభామ — కావాలీ నాకొక్క ఖాళీ స్తంభం

బృందం — అక్కర్లేదూ మాకు చల్లా కుంభం

అంతా — స్తంభాలాట నేడు స్తంభాలాట-రేపు
సంఘంలో ప్రగతికి గుంజూలాటా

బృందం — ఉన్నా స్తంభం వదిలీ తారాడు తాం
వెన్నాడీ భామానూ వెక్కిరిస్తాం

గొల్లభామ — ఖాళీ సంఘం అందుకొంటానంటా
వారి తలపై పెడతా చల్లాకుంటా

అంతా — స్తంభాలాటా నేడు స్తంభాలాటా-రేపు
సంఘంలో ప్రగతికి గుంజూలాటా (గాంగ్)

పంతులు — చూపులకీనాడు బాల బాలికలయ్యా, వీరే
రేపటి దేశానికి పరిపాలకులయ్యా

ఎల్లలు — పాటలు ఆటలు చాలిక పదండి బడికి, అదుగో
పంతులు పూజారి వచ్చె చదువుల గుడికి

పంతులు — ఆడేదీనాడు గొల్ల స్తంభాలయా - రేపటి
మేడలు లేచే మూల స్తంభాలయా
కుదురేదో స్తంభాలకు మదురేదో మేడలకూ
గదులేవో దీపాలకు, కుదిరించే క్రమనాది

చదువూ సున్నపుగానుగ కదిలించే మేస్త్రీ నేనూ
ప్రాజదువులు క్రొంజదువులు పలికించే శాస్త్రి నేను
పంతులు నేను, నిత్య వసంతుడనేను

పిల్లలు — ఆటలనూ పాటలనూ చాలించాలి - మనమిక
పంతులు చెప్పే పాఠాలాలించాలి

(పంతులు బడిగంట మ్రోగిస్తాడు)

(కుర్చీ, బల్ల తీసుకువచ్చి స్టేజిమీద పెడతారు)

పిల్లలు — గణగణా బడిగంట మోగించారదే మన పంతులు

పంతులు — రణగుణధ్వని మాని ఆపరె పిల్లలూ మీ గంతులు

పిల్లలు — ఆటా పాటా చెల్లంగోర్
అందరు తరగతి చేరండీ

పంతులు — పాఠాలారంభించే ముందర
ప్రార్థన చేదాం రారండీ

(పంతులు చెపుతుంటే పిల్లలు తిరిగి అంటూంటారు)

పంతులు — తెలుగుతల్లికి వందనం మా భరత ధాత్రికి వందనం
దేశికవులకు పూర్వ భారత దేశికులకిదె వందనం
మంచి చెడుగుల మేలు కీడుల నెంచు తెలివికి వందనం
మానవుల మహాత్మాశయులుగా మలచు శక్తికి వందనం
శాశ్వతమై సత్యమై ఈ విశ్వగతికే మూలమై
ఈశ్వరుండని జ్ఞానులెరిగిన ఏక శక్తికి వందనం

(అభినవ కుమారు అను విద్యార్థి ప్రార్థనలో పాల్గొనక వెనక్కి తగ్గి మూతి బిగించి, నిరసన తెలియ చేస్తూంటే, మిగిలిన వారు మొగాలు చూసుకొంటూ ఉంటారు)

అభినవ పంతులుగారూ, మీకిదిగో సలాము
వద్దు వద్దు మా బుద్ధి కిలాటి మలాము
ఎరగని ఈశ్వరుడెవరో ఎలా నమ్మడం?
పెరుగుతున్న విజ్ఞానం ఎలా మరవడం?

(వద్దు వద్దు మా బుద్ధికిలాటి మలాము)

పంతులు తరతరాల సత్యాన్వేషణలు గమ్యము
పెరిగే విజ్ఞాన పరుల కెల్ల మాన్యము
దైవభక్తి గురుభక్తుల కలదు సామ్యము
వినయ వివేచనలు లేని విద్య శూన్యము

అభినవ పంతులుగారూ, మీకిదిగో సలాము
వద్దు వద్దు మా బుద్ధికిలాటి మలాము
ప్రశ్నించే తర్కబుద్ధి ప్రగతి ధర్మము
విద్యార్థుల విజ్ఞానము పెరుగు మర్మము

నవకుమార్ పాత నడక పిడదు మాగుకు జనబోధ
కొత్త పరుగు లెత్తును యువనాయకబోధ
స్వాతంత్ర్యము నద్దించిన జాడలివేనా?
స్వతంత్ర భారతము చెప్పు చదువులివేనా?

పంతులు బడిలోపల ఒక పాఠం
బడి వెలుపల ఒక పాఠం
గుడిలోపల ఒక బోధ
గుడి వెలుపల ఒక బోధ

బృందం పాఠాలు బోధనలూ బహువిధమాయె
పాఠశాల క్రమశిక్షణ పరిమితమాయె (గాంగ్)
పిల్లల్లారా వినండి చరిత్ర నేర్పిన పాఠం
జగతు చరిత్ర మారుగా...

భరత భువికి కనువిప్పులూ
భారత చరిత్ర మార్పులు
జగత్తుకే కనువిప్పులూ

బృందం శతాబ్ది సాగిన సమరమూ
స్వతంత్ర మొసగిన దమరమూ
ఒక్కసారిగ స్వతంత్రతా
ఉప్పెనై పొరలె అంతటా

పంతులు స్వతంత్ర సాధన దీక్షతో
విదేశ ప్రభువుల కక్షలో
శతాబ్ది కఠిన పరీక్షలో
పెద్దలు పొందిన శిక్షతో

బృందం శతాబ్ది సాగిన సమరము
స్వతంత్ర మొసగిన దమరము
ఒక్కసారిగ స్వతంత్రతా
ఉప్పెనై పొరలె అంతటా

పంతులు హక్కులేవి అని శోధనా
విధులనే మరచు బోధనా
పొందబోరు క్రమశిక్షణా
అందుకో రొకరి రక్షణా

బృందం ఒక్కసారిగ స్వతంత్రతా
ఉప్పెనై పొరలె అంతటా
పిల్లల మనసులు మార్చెను
పెక్కుగతుల నాగరికతా (గాంగ్)

పంతులు చదువకమును పనేవారు చాకరతాయ
చదువు వచ్చి యిపుడందురు శీకరతాయ
గురువులన్న పెద్దలన్న తిరస్కారము
నామం పెట్టక పోడమె నమస్కారము

ఆడపిల్లలన్న అలుసు అడుగు అడుగునా
పడిపించి వేస్తారేదాది పొడుగునా (గాంగ్)

(పంతులు పరోక్షంలో) (కాంతసేవు) (పంతులు నిష్క్రమణం)

సుకుమార్ రైట్ రైట్ రైటో
రైట్ రైట్ రైటో, అదో
జాస్మిన్ వైట్, ఇదో
అదో సెర్చ్‌లైట్
పడింది నాపై సైట్
వెచ్చింది నా డిలైట్ రైట్
రైట్ రైట్ రైటో
రైట్ రైట్ రైటో
స్ప్రింగ్ స్ప్రింగ్ స్ప్రింగో
స్ప్రింగ్ స్ప్రింగ్ స్ప్రింగో - ని
లిస్తే డాన్సింగ్ - న
డిస్తే బౌన్సింగ్ - మా
టాడితే పక్టింగ్ - చూపు
చూస్తే రయిటింగ్ - రంగ్
స్ప్రింగ్ స్ప్రింగ్ స్ప్రింగ్
స్ప్రింగ్ స్ప్రింగ్ స్ప్రింగో (గాంగ్)

అనసూయ చూడండి మేస్టారు యీ సుకుమారు
నిక్‌నేమ్‌తో పిలుస్తాడు మము పలుమారు

ప్రియంవద బడిలోనూ బడి బయటా అదే మాగు పేరు
ఖాయమాయే మారుపేరు, పోయే అసలు పేరు

ప్రేమలత మాకు పేరు నచ్చెనంటె నీదేనోయ్ తప్పు
బడిలోనికి రావడాని కెందుకు మేకప్పది?
జడ అల్లి అల్లకుండ ముందో వెనకో పారేస్తావ్
బడిలోనికివచ్చి దాన్ని అల్లి విప్పి ఝళిపిస్తావ్

రాదా మరి వచ్చెనంటె నీకు మూరు పేరు?
ఏదీ తెలుసా పంతులుగారి అసలు పేరు?

(పంతులుగారు వెనక నుంచి స్టేజి పైకి వస్తూ వుంటారు)

సుకుమార్ బిడ్డు పంతులుకి జిలేబి జాంగ్రీ
బడ్డు పంతులుకి ఖాదంకీర్
ఎడ్డి పంతులుకి లడ్డు మిఠాయీ
మడ్డి పంతులుకి మసాలావడ (నవ్వులు)

(ప్రేక్షకులు నవ్వుతారు - వాళ్లవైపు చూపు)

నవకుమార్ సిగ్గులే కటు నవ్వుతారేం ?
చిన్న పెద్దా తారతమ్యం
చూడవద్దా - తెలుసుకోరేం
చదువులకు ఇదియేన గమ్యం ?

పంతులు గురువులన్న పెద్దలన్న తిరస్కారము
నామం పెట్టక పోదమె నమస్కారము
ఆడపిల్లలన్న అలుసు అడుగు అడుగునా
ఏడిపించి వేస్తారేడాది పొడుగునా
చదువక మునుపనే వారు కాకరకాయ
చదువు వచ్చి యిపుడందురు కీకరకాయ (గాంగ్)

బృందం అల్లరికి మరి అరాచకానికి
కల్ల చదువులకు కపటముకూ
పిల్లలదే ఒక పేరాయె - లది
పిల్లలదే ఒక పేరాయె

ప్రేమలత పరీక్ష పేపరు ప్రశ్న లేవిటో
బట్ట బయలుగా తెలియాలి
జవాబులన్నీ చూచికాపిగా
చక చక వ్రాసి నడవాలి

ఇదేవిటి అఘాయిత్యం అని
ఎవరూ అడగక వదలాలి

పంతులు అడిగిన పంతులు గడియ గడియకూ
అల్లరి మూకకు జడవాలీ

(కళ్ల జోడూ పాగా బల్లమీద పెట్టి పంతులు వెళ్లిపోతాడు)

బృందం అల్లరికి అరాచకానికి
కల్ల చదువులకు కపటముకూ
పిల్లలదే ఒక పేరాయే బడి
పిల్లలదే ఒక పేరాయే

నవకుమార్ స్వర్గమర్త్య పాతాళాలందున
పేవరు దిద్దే దెవరయినా
మార్కులు తక్కువ వచ్చేవారికి
భర్తీ మార్కులు వెయ్యాలీ
చదివిన వారిని చదవని వారిని
బడినంతా ప్యాస్ చెయ్యాలీ

ప్రియంవద , అల్లరికాకుంచే సమ్మెలు చేస్తే
అనక బడినే మూయ్యాలీ

బృందం అల్లరికి మరి అరాచకానికి
కల్లచదువులకు కపటముకూ
పిల్లలదే ఒక పేరాయే - బడి
పిల్లలదే ఒక పేరాయే

ప్రేమలత ఓరిమికి మరి - కూరిమికి
ఓపలేని పేదతనముకూ
పంతులుదే ఒక పేరాయే - బడి
పంతులుదే ఒక పేరాయే
ఎదుగూ బొదుగూ లేని జీవితం

జీతగాండ్రలో కనిష్ఠ జీతం
ఊరిపెద్దలకు ఉద్యోగులకు
ఒదిగి ఒదిగి మసిలే దుర్గతికి
పంతులుదే ఒక పేరాయే - బడి
పంతులుదే ఒక పేరాయె
స్వతంత్ర భారత జాతి చరితలో
పంతులు ప్రగతికి పొంతన లేదా?
దేశంలో అత్యున్నత పదవికి
దీప్తి నిచ్చు ధీమంతుడు పంతులె
దేశంలో ఆగర్భ దరిద్రుడు
దీనుడైన సామంతుడు పంతులె
పంతులు అంటే చదువుల గనిగా
పంతులు అంటే తెలివికి గురిగా
వెలుగులు చిమ్మే విద్యార్థునిగా
రాష్ట్రపతి పదవికినుమూరులు గౌ
రవము తెచ్చినదీ మా బడిపంతులె
ఎటువైపు, ఈనాడు, ప్రసరించునో పంతులు చూపు
అటువైపె అటువైపె - పయనింతురు పిల్లలు రేపు
ఇటు చూడు, అటు చూడు, మురిపించునవోదయ రేఖల్
కుడియెడమ, నడుమ నడుమ, తలలూపుతు పిలుచు
పతాకల్
ప్రతి పల్లే, ప్రతి బస్తీ, పచ్చనౌను ప్రజారాచరికం,
ప్రతివాడా, ప్రతియేడా సుఖ శాంతులొందవు సమలోకం
(గాంగ్)

(ప్రిన్సిపాల్ క్రింద పాట పాడుతూండే విద్యార్థులంతా లోపలకు పోయి కాన్వొకేషన్ దుస్తుల్లో పట్టాలతో తిరిగి వస్తారు)

ప్రిన్సిపాల్ ప్రజాస్వామ్య పథంలో
పాతికేళ్ల ప్రగతిలో
స్వతంత్ర భారతంలో
చదువులెలా పెరిగాయి?

బృందం: విరివి నేలబారుగా
విలువ నిలువు జారగా

ప్రిన్సిపాల్: చిన్న బడులు, పెద్దబడులు
ఉన్నత విద్యల నెలవులు
ఉరకలు వేస్తూ పెరిగాయ్
ఊరూరా పేట పేట

బృందం: విరివి నేల బారుగా
విలువ నిలువు జారగా

ప్రిన్సిపాల్: ప్రతి జిల్లాలో తాలూకాలో
పట్టభద్రులను తీరిచి దిద్దే
సాంకేతిక విజ్ఞాన నవనిధులు
చరిత్రాదు తాకళల పెన్నిధులు
ఉరకలు వేస్తూ పెరిగాయి
ఊరూరా ప్రతి పేటా

ప్రిన్సిపాల్: ఊరూరా ఇంటింటా
ఊరి ఊరి వెలువడ్డారు
ఎందరేసి పట్టభద్రులో
ఏటేటా వెలువడ్డారు
అందరికేవీ అనువగు పదవులు
అందరికేవీ ఉద్యోగాలూ
నిరుద్యోగమూ, నిస్సహాయతా
నిత్యం పెరిగే నిరుత్సాహమూ
కలిమి లేములా వ్యత్యాసాలకు
కక్షలకూ బలమిచ్చు పాలమూ

ఒక బృందం: ఇటురండోయ్ - ఇటురండి,
ఎడమవైపె చూడండి,
పట్టభద్రులూ - ఓహో, అపర రుద్రులూ,
యువలోకం కలలు కనే నవలోకం నిర్మిద్దాం

నవలోకం సమతాలోకం
ఎడమవైపె ఎడమవైపె
ఇటు రండోయ్ - ఇటు రండి
ఎడమ వైపె చూడండి

ఇంకొక బృందం అటుకాదోయ్ ఇటురండి
కుడివైపే చూడండి
పట్టభద్రులూ - ఓహో, వీరభద్రులూ
తరతరాల సంస్కృతి పాతరలో నూతన స్వర్గం
అదియే సమతా స్వర్గం
కుడివైపే కుడివైపే
అటుకాదోయ్ ఇటురండి
కుడివైపే కూడండి

ఒక బృందం ఎడమ వైపె

ఇంకొక బృందం కాదు కాదు కుడివైపే

ఒక బృందం కాదు కాదు ఎడమవైపె

ఇంకొక బృందం కుడివైపే

ఒక బృందం ఎడమ వైపె

ఇంకొక బృందం కుడి వైపే

ఒక బృందం ఎడమ వైపే
కుడి యెడమ తగాదా - తీర్పరి
ఓటు పెట్టెయే, కాదా-
(భరత వాక్యం)

పిన్సిపాల్ వోటు హక్కు లభియించేవరకూ
చదువులు నేర్చే విద్యార్థులకు
కుడి యెడమలతో కూడదు జోక్యం

క్రమ శిక్షణతో చదువే ముఖ్యం
ఇదియే భరత వాక్యం

విద్యార్థులు విద్యాలయ సరిహద్దుల నడుమ
విద్యలు గరపే ఒజ్జల కెల్లా
సర్వసమ్మతాంశము లే పాఠ్యం
శీలవంతమౌ నడతయె ముఖ్యం

ఇదియే భరత వాక్యం



# పాలేరు: కొత్తదారి



బోయి భీమన్న

పాత్రలు

బాలకృష్ణయ్య
బలరామయ్య
ఎరుకయ్య

రంగాలంకరణ

అధునాతనమైన ఒక గ్రామం కనపడే విధంగా తెరలు – సైకిలు

[ఇద్దరు ప్రయాణీకులు దారి వెతుక్కొంటూ ప్రవేశిస్తారు పల్లెటూరి వేషం చాల దూరం నుంచి వస్తున్న లక్షణం అంతా క్రొత్తగా వుంది వారికి వారి పేర్లు బాలక్రిష్ణయ్య, బలరామయ్య. దారే పోయే వాళ్లని దారి కోసం అడుగుతుంటారు అందుకే సంబంధించిన ఈ పాటను ఇద్దరూ కలిసీ, ఒకరి తరువాత ఒకరూ పిలుపు ఇట్టి పాడుతూ, ముందుకు సాగుతారు ]

బా, బ దారి ఎవరైన చెప్పుతారండి? బాబు!
ఊరి కెళ్ళే దారిదేనాండి? బాబు!
తెలుసు నను కొన్నాము,
తెరువు తప్పేశాము,
సందలడి పోతేను
బందలను పోలేము ॥దా॥

ఇక్కడే నుండాలి ఒక చిన్న డొంక,
పక్కగా పోవాలి పావన్న లంక,
దారి పొడుగున ముళ్లు,
దారి పడితే, చెల్లు!
ప్రొద్దు గూకిందంటె
పెద్దలకె గడగళ్లు ॥దా॥

మా ఊరు ఇది కాదో? మరచి వొచ్చామొ?
ఏ ఊరు వచ్చామొ? ఇపుడేమి దిక్కు!
చాల దూరం నుండి
సాగి వచ్చామండి,
పాత వాళ్లమె కాని
గోత బడ్డామండి ॥దా॥

[అంతట వారికి ఎదురుగా సైకిలు నడిపించు కొంటూ వాలంటీరు కుర్రవాడు వస్తాడు అతని పేరు ఎరుకయ్య. అతడు ఆగి, వారి మాటలు వింటాడు పలకరిస్తాడు ]

ఎరుకయ్య ఎవ్వరయ్యా, మీరు?
ఎందుకటు పోతారు?

దారి లేదటు కేసి,
ఊరు లేదటు ప్రక్క.
కంచె కట్టిన తోట
కనిపించడం లేద?

ఎటునుండి వచ్చారు?
ఏఊరు పోతారు?
ఆమడలుగా నడిచి
అలసినట్లున్నారు!
దారి తప్పిన బాట
సారు లట్లున్నారు!

కొత్త దేశము జూచు
కోర్కెతో వచ్చారో!
పల్లెలో ఏదైన
పని వుండి వచ్చారో?
అటు దారి లేదండి!
ఇటు కేసి మరలండి!

బా, బ దేవుడే మొరాలకించి
తోవ చూప వచ్చెనయ్య!
దిక్కు లేని రాత్రి ఇందు
కుక్క చావు తప్పెనయ్య!

కొత్త వాళ్లు కాము కాని
కొత్తగుంది ప్రాంత మెల్ల!
దారి తెన్ను లేని మాకు
దైవ మట్లు దొరికి తయ్య!

పల్లెటూరు పోదమంచు
పట్న మేదో చేరి నాము!
ఇంద్ర జాల మేదో మమ్ము
ఇందు తెచ్చి త్రిప్పనేమొ!

చిక్కు విప్పి నాకు దారి
దిక్కు చూపి, మనుపు మయ్యా!
కుర్రవాడ వైన గాని
కృష్ణ మూర్తి వౌదు వయ్యా!

ఎ కయ్య పట్నమిది కాదండి!
పల్లెటూరే నండి!
పాపన్న లంక కిది
ఎకదైన రోడ్డండి!

ఏ పల్లె వారండి మీరు?

ఇన్నేండ్లు

ఏ లోక మందుండినారు?

శా, బ పాపన్న లంక కిది
ఎకదైన రోడ్డా?
బళ్లు పోతున్నాయి!
బస్సులె వస్తున్నాయి!

మరికే దొంకేమైన దిక్కడ!

సొద లోతు

బురద గుంటుందేది అక్కడ!

ఎ కయ్య కోనండి, అది యెల్ల
ఐదేళ్ల క్రిత మండి!
ప్రాత కాలంలోనె
బ్రతుకు లాగేమండి?
ఎంతో మార్పు వచ్చెనండి!

దేశమే

ఎంతో ముందుకు పోయెనండి!

బండి పై వెళతార ?
బస్సెక్కి పోతాగ ?
నలు దెసలు కనుగొంచు
నడిచి పారేస్తార ?
పొద్దు గూకే తలికె సుళువుగా
మీరు
పోవచ్చు నడవండి తిన్నగా !

[రోడ్డును చూపించి, ఎరుకయ్య తన దారిని తను పోతాడు బలరామయ్య, బాలక్రిష్ణయ్య ముందుకు నడకాయించి బచి, నడక ఇంకించుకొంటారు వారికి అంతా కొత్తగా కనిపిస్తున్నది ఆశ్చర్యంగా వుంది డొంకంతా బాగు చేసి, మెయిను రోడ్డునుంచి తమ వూరికి ఇంత చక్కని రోడ్డును ఎవరు వేశరో! వారు దూర దేశంలో పని కోసం పోయి వదిలేశ్యయింది ఇంతలో ఎంత మార్పు!]

బలరామయ్య పనులే లేక పొట్ట చేత పట్టుక మనము
పట్నాలు చేరినాము పొట్టకోసము,
అదే చూడు ! రోడ్డు కిటూ, అటూ వందలాది
అడ మగా చేరి కడుదు రడ్డుకొన్న నది !

బాలక్రిష్ణయ్య బలే వంతెనొవారో ! బలే పసందైన వంతెన !
వంతెనతో అన కట్ట, వరాలంటి యోచన !
ఊరందరికిదే పెట్టు టీసనంత తిండి !
దారి చూపుతున్న ధర్మ తండ్రులెవరోనండి !

బలరామయ్య క్రొత్త వింతలను చూపుగు ప్రొద్దు గూకి పోయె
ప్రొద్దు చిన్న చిన్న వెలుగు ముద్దలట్లు రాలె !
ముళ్ల దారి, మురికి దారి కళ్లముందె రోడ్డయ్యె
బల్లు జల్లు మను చీకటి ఒక్క సారె వెలుగయ్యె!

బాలక్రిష్ణయ్య మాటల సందట్లోనే
మన వూరొచ్చినట్టుంది !
మన వూరో కాదో యిది !
మాయ మంత్ర మట్లుంది !

బలరామయ్య అనుమానం లేదు, చూడు,
అదె మామిడి తోట।
తెచ్చు జ్ఞప్తి కప్పటి కో
తి కొమ్మచ్చి యాట।

బాలకృష్ణయ్య మామిడితోట ప్రక్కనే
మాల పేట వుండేది।
కనిపించుట లేదిప్పుడు,
కాలి పోయి వుంటుంది।
ఊరు వెలుప లుండు తోట
ఊరు మధ్య కొచ్చింది।
పట్నంలో వలెనె రాత్రి
పట్ట పగలుగా వుంది।

బలరామయ్య ఉనికె ఇంత మారిందే!
మనుషు లెంత మారారో!
కొత్త దనంలో మనల్ని
చెత్తలాగ చూస్తారో!
పనికోసం వెతుక్కొంటు
పల్లెను విడిచాము మనము
పనివాళ్లను పెంచుకొంటు
పల్లెయె విడిచినది మనల!

[అంతలో అక్కడికి ఎరుకయ్య వస్తాడు సైకిలు దిగుతాడు గ్రామం సమీపంలో రోడ్డు ప్రక్కను తచ్చాడు తున్న బాలకృష్ణయ్య బలరామయ్యలను చూస్తాడు పల్కరిస్తాడు]

ఎరుకయ్య మీరు అడిగిన ఊరు ఇదే గద?
దారి తప్పక వచ్చితిరి గద?
కొత్త రోడ్డిది, ఇంక కొంచెం
మెత్త బడవలసున్నది

బురద గుంటలు పూడ్చి పెట్టి,
బోదెలకు నంతెళ్ళు కట్టి
ఎత్తు పెంచీ, రోడ్డు వేయుట
కెంతయో శ్రమ యైనది
తెగవు పొడవున రెండు ప్రక్కల
తీయ మామిడి చెట్లు నాటిరి,
తెర్వరికి శ్రమ బాపి ఆకలి
తీర్చవలెనంచు
మేఘ వనములు వెదకి త్రవ్వి
మెరుపు తీగలు తెచ్చి నారట!
దారి పొడవున పూచి మల్లెలు!
ఊరె వికసించె!

జా, బ చాల చిత్రం విచిత్రం! ఈ
శ్రమంతా పడ్డ వారెవరో!
రాజబాటకు పల్లెటూరికి
రాజీ చేసిన దెవ్వరో!
చాల చిత్రం విచిత్రం! ఈ
జనాలను మేల్కొల్పి రెవరో!
సాగుదాయకి చింత గల, ఆ
సహజ నాయకు లెవ్వరో!
వత్సరం పండ్రెండు నెలలూ
వర్ష కష్టల, వర్గ కక్షల
కొట్టుకొని చచ్చేటి ఊరొక
కట్టడికి వచ్చిందె! చిత్రం!
ఊరి వెలుపలి మాల పేటకు
దారి తెన్నులు లేవు పూర్వం
పేట కనపడదిపుడు, వెన్నెల
తోట అయ్యిందూరు! చిత్రం!
ఊరి లోపలి మురికి కంతా
ఊరి వెలుపలి పేట మచ్చు,

గచ్చు అరుగుల భవంతులకు
రొచ్చు గుడిసెల బ్రతుకె చిచ్చు
రొచ్చు మచ్చలు తుడిచి వేసే
చిచ్చు నెరసులు ఆర్పి వేసే
మనుషులందరి మేలు కోసం
మనసు విప్పిందెవ్వరో ।

ఎరుకయ్య ఔను మీరన్నది నిజమ్మె
అగ్గి నిప్పుల వంటి యువకులు
గ్రామ సారథ్యమ్ము గొని, సం
క్షేమ రాజ్యం చేయు సాగిరి
మురికి గుంటలు పూడ్చి పెట్టిరి,
మురికి పేటలు తుడిచి పెట్టిరి
మాల, సాలె విభేద భావం
మాని, గ్రామము నొకటి చేసిరి
భూమి దానం, గ్రామ దానం,
పుష్కలమ్మైన శ్రమ దానం
ప్రజ నిదానం, ప్రభు విరాళం
పల్లెకొసగెను పునర్జీవం ।
చూడు దవిగో ! వీధులన్నీ
సూర్య చంద్రుల నిలుపుకొన్నవి ।
సమితి కార్యాలయమె సంస్కృతి
శారదకు ఆస్థాన మైనది ।
పంచ వర్ష ప్రణాళిక సా
ధించి నట్టి పురోభి వృద్ధిది,
గాంధి దేవుని మహిమ చూతురు
గాని, రండిక లోనికి ।

[ఎరుకయ్య సైకిలుతో ముందు నడుస్తుండగా, బలరామయ్య, బాలక్రిష్ణయ్య ఆశ్చర్యంతో చుట్టూ చూచుకొంటూ, ఆ పునర్నిర్మిత సుందర గ్రామంలోకి ప్రవేశిస్తారు ]




## పాత్రలు

రాణి
రంగి
నాట్యాచార్యులు
రంగడు

## ప్రస్తావన

నాట్యావగాహనకు ఈ నృత్యనాటిక ఉద్దేశింపబడినది ఇందులో ప్రాచీన, జానపద, జాతీయ నృత్యాలు ప్రదర్శింపబడును గేయాలలో త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్రగతులు పాటింపబడినవి ఎల్లలలో నిండి నిబిడీకృతమై యున్న లయగతికి, ఉత్సాహశక్తికి ఇది సరిపడుతుంది

## మొదటి రంగము

ప్రారంభం [బృందగానం]

వందనమిదె వందనమిదె
వందన మానంద రస
స్పందన మొనరించు శ్రీకి
సుందర సుమ నాట్య శ్రీకి!

జీవిత మద్భుత నాట్యం
జీవులంత నర్తకులు!
తమ పాత్రల అభినయించి
తరలి పోదు రెటకో తుది

ఆది అంత మున్నది మన
అందరి జీవితములకు!
ఆది అంతము లేనిది లే
దా యనంత చలనమునకు —

ప్రకృతి చలనమునకు!

రాణి [ప్రవేశము]

ఎవరక్కడ? ఎవరక్కడ?
ఏమి? చెప్పరు వినబడదా?
ఒరే రంగ! ఒసే రంగి!
అరే రండి వేగంగ
రండి! రండి! రండి
రండి రండి రండి వేగంగా

రంగడు, రంగి [ప్రవేశము]

వచ్చామండి! వచ్చామండి!
వచ్చామండి రాణిగారూ!

ఆజ్ఞలు సెలవీయండి
అవి నెరవేర్చేమండి!

రాణి ఎవరూ ఒక్కరు లేకుండా
ఎటు పోయారు మీరు?
ఎన్నిపనులు ఉన్నవో నాకిప్పుడు
ఎరుగుదురా మీరు?

రంగడు, రంగి రాణిగారూ చిన్న రాణిగారూ!
రమణీయ ప్రత్యూస మన తోటలో
తీగలూ అంటులూ బాగుచేశామండి
మళ్లు తవ్వేమేము నీళ్లు పోశామండి!

రాణి తెలియదు మీకు,
ఈదినమున నాకు,
నర్తన శిక్షణ తరగతి
ఉన్నదన్న సంగతి?
అప్పుడే చని గురుదేవుని
చప్పున తీసుకురండి

రంగడు, రంగి చిత్తము ఇదె వారిని కొని
తెత్తుము ఒక ఘడియలోన

## 2వ రంగము

నాట్యాచార్యులు [తాళము వేయుచు పాడుచుండును రాణి సమానక భంగిమలో నిలచియుండును ]

నందికేశ్వరు మదిని ఎంచు
వందన క్రియ మాచరించు
మార్గ నాట్య ప్రదర్శనమును
మహిత శక్తిని ఆచరించు!

తాం, తాం, కిటతక తద్ధిత్తాం ధిత్తాం
తాం, తాం కిటతక తద్ధిత్తాం ధిత్తాం
తద్ధిత్తాం ధిత్తాం తద్ధిత్తాం ధిత్తాం
తద్ధిత్తాం ధిత్తాం తద్ధిత్తాం ధిత్తాం
తద్ధి తధిగిణ తోం
తద్ధి తధిగిణ తోం
తద్ధి తధిగిణ తోం॥

ఆకులపై అలరేటి పువ్వులా
నింగి నీలి తేలేటి చుక్కలా
మిన్నువాకగా వెన్నెలరేకగ
గజ్జెలు మ్రోగగ కన్నులు చెదరగ
నాట్యరాణి నర్తించు మించు —
నాట్యకళా ద్యుతి వెలయించు।
తద్ధి తధిగిణతోం, తద్ధి తధిగిణతోం, తద్ధి తధిగిణతోం —।

## ౨వ రంగము

[బృందగానం]

జనపదాలలో జనన మందినది
నరనారీ జన నాట్య రూపమిది
అందరికీ ఆనందోత్సాహము
అందించు సంఘ శక్తి పుక్తి ఇది।
దేశి రూపము దివ్య నృత్యమిది।

నాట్యాచార్యులు [తాళము వేయుచు పాడుచుండును రాణి రంగడు ... ...
హోదాలో నాట్యమందు పాల్గొందురు ]

అందరు ఒకటేరా — కులాలు
అర్థవిహీనమురా — మతాలు
మత్తు బీజములురా॥

రాణీయన్నా రంగమ్మన్నా
రంగయ రజాక్ ఎపేరన్నా
అందరు మనుషులురా, వా
రన్న దమ్ములేరా, వారి
రక్తము ఒకటేరా॥

రండి రండి। కలపండి చేయి చెయి।
దండి బలం చూపండి। 'అందరొక
టండి। అంటు చాటండి। శాంతి నిల
పండి। జగతి వెలగండి। దివ్యముగ॥

అందరు ఒకటేరా। వా
రన్న దమ్ములేరా॥

## 4వ రంగము

[బృంద నృత్యము]

కాలగతిని కనుము మనుము
నేల నాల్గుదిశల చనుము
నీకె తెలియునోయి భావు
నిర్మల జీవితపు హాయి॥

స్వతంత్ర భారత పౌరులమూ
స్వతంత్రముగ మనగలమూ

అందరొకటే ప్రేమ
బంధ మొకటే సుమ్మ

'మనవలెనె అందరును
మనవలెను' అని నమ్ము॥

స్వతంత్రభారత పౌరులమూ
స్వతంత్రముగ మనగలమూ॥

'నాదినాద'ను స్వార్థగుణమది
నరులకెన్నడు మేలు గూర్పదు।
'మనది మనద'ను మహాగుణమది
మానవ శ్రేయమ్ము గూర్చును॥

స్వతంత్రభారత పౌరులమూ —
స్వతంత్రముగ మనగలమూ —






## పాత్రలు

కృష్ణవేణి ప్రజాశక్తి నలుగురైదుగురు స్త్రీపురుషమూర్తులు నాగార్జునుడు ఇందులో పాత్రలుగా వస్తారు అక్కడక్కడ నేపథ్య కంఠం వినిపిస్తుంది

## రంగాలంకరణ

(యథోచితమైన రంగంలోకి కృష్ణవేణి ప్రవేశిస్తుంది ఒక ప్రక్క యోగముద్రలో నాగార్జునుడు మరొకప్రక్క మౌనముద్రలో కొందరు ప్రజలు ఉంటారు)

## ప్రస్తావన .

[వేల వేల వసంతాలుగా కృష్ణవేణి ప్రవహిస్తున్నది ఎన్నో శతాబ్దాలు ఆమె కింకిణీ క్వాణంలో కరిగిపోయినవి ఎన్నో సామ్రాజ్యాలు ఆమె పుణ్యతీరంలో వెలిసిపోయినవి అయినా ఏనాడు ఎవ్వరూ ఆమెకు ఉండటానికి ఒక ఇల్లైనా కట్టలేదు నిలువ నీడలేని తాను ఎవరికీ సాయపడలేక పోతున్నానని, తన సంపద అంతా అడవిగాసిన వెన్నెలై పోతున్నదని విలపిస్తుంది, ప్రజల పంచలో ఉండలేక పోతున్నాననే వేదనతో కృష్ణమ్మ కన్నీటి కాలువై కదలి దారిపట్టింది

స్వాతంత్ర్య కాంతి స్నాతులు, విజ్ఞాన విజేతలు, సాహసోపేతులు అయిన నేటి తెలుగు జనకోటి ఆమెకు మహా సౌధం కట్టడం, ఆమె కన్నీరు పన్నీరుగా మార్చడం ఈ నాటికలోని ఇతివృత్తం యోగనిద్రా ముద్రనుండి నాగార్జునుడు ఈ సాగర సౌధ నిర్మాణానికి ముహూర్తం పెట్టి ముగ్గు పోయిస్తాడు ]

కృష్ణవేణి    నిజమేనా నిజమేనా ?
నేను కన్నకల నిజమేనా ?
బాధామయమౌ నా చిరగాథ
పండువెన్నెలై విరిసేనా ?
రాలే నిండిన నా ఒడినిండ
రత్నరాసులిక కురిసేనా    నిజమేనా॥

ఎవరాలించని నా వేదనలు
ఈ నాడందరు విన్నారా ?
ఎవరూహించని నా శక్తులను
ఈ నాటి ప్రజలు కన్నారా ?

[అప్పుడు నేపథ్యకంఠం వినిపిస్తుంది తదనుగుణంగా కృష్ణవేణి స్పందిస్తుంది ]

నేపథ్య కంఠం    కన్నీరు తుడుచుకో
కృష్ణవేణి నీ
కష్టాలు ఈడేరెనమ్మా
నిజమేను, నిజముగానే
నీకలలు పండె
విజయహాసము చిందు మమ్మా    కన్నీరు॥

అడవి పాలైన నీ అందాల బ్రతుకింక
ఆరాధనీయమౌనమ్మా
కడలి పాలైన నీ సంసార సంపదలు
కనకంపు కోటలౌనమ్మా — కన్నీరు॥

వినుము విస్మృత చరిత్రము లేచి నాగార్జు
ముని గళమ్మున మ్రోగె నిదిగో
విను, ప్రజాతంత్ర స్వతంత్రతా కాహళులు
వీర జన కంఠాల నదిగో — కన్నీరు॥

[అప్పుడు నాగార్జునుడు యోగనిద్రనుంచి మేల్కొంటూ]

నాగార్జునుడు — ఎవరో నను లేపినారు
ఎడతెగని నిదుర నుండి
విధియే పదద్రోసి చనిన
శిథిలాలను కదలించి
నా దట్టపు చీకటి గది
లో, దీపము వెలిగించి — ఎవరో॥

కలిసి, అమర త్రిశరణార్థి
గానము కృష్ణా గళముగ
నిదురపోతి, నేని ని
ర్నిద్ర బౌద్ధ విహారమున — ఎవరో॥

ఆనాటి విజయపురిని
ఆనాటి కళాలయమును
విజ్ఞానధనులు పునరా
విష్కరించెదరు ఎవరో — ఎవరో॥

ప్రజాశక్తి — తల్లీ కృష్ణా నదీమతల్లీ
తరగని బాధా తరంగ వల్లి
సుందర దేశచరిత్ర
శుక్తి గర్భమున పుట్టి

పథములేని దేదో మహా
ప్రస్థానము తలపెట్టిన — తల్లీ॥

నీదారిని అడ్డిన ధా
త్రీ ధగాల చీల్చినావు
కోనల లోయల బడి, కో
కో యని మము పిల్చినావు — తల్లీ॥

సెలయేళ్ళుడినట్టి జాలం
జలంలు స్వీకరించినావు
గ్రీష్మాంగన కోపానల
కీలలు ధరియించినావు — తల్లీ॥

అందినంత వరకు జీవ
మందించితి వెందరికో
ఎటు తోచక నీవే పో
యితి వేసాగరమునకో — తల్లీ॥

కృష్ణవేణి — ఆహా ఎన్నాళ్ళకు ఈ
అమృతవాణి వీననాయెను
అపుడే నాకనులలోని
అశ్రుజలము విడిపోయెను — ఆహా॥

ఎవరో మీ రెవరో నా
ఎద ఎదను కదల్చివారు
ఇంత చల్లగా, నా సుతు
లేనా నను పిల్చినారు — ఆహా॥

నిలువు నీడ లేని నాకు
విలువ ఏమి, చలువ ఏమి ?
చేరదీయ నవు డెవ్వరు
చింతించుటగాక ఏమి? — ఆహా॥

కష్టాలను నష్టాలను
కవిత లల్లుకొన్నాను
కలల అలలలో తేలుచు
కాలము వెళ్లబుచ్చినాను  ఆహో॥

ప్రజాశక్తి  స్వతంత్రభారత
ప్రభాత కాంతి
చ్ఛటా స్నాతులం
శాంతి దూతలం  స్వతంత్ర॥

నేలయు దున్నెడి
హాలికులం ప్రగ
తీ లతికా పరి
పాలకులం  స్వతంత్ర

దారిద్ర్య పిశా
చీ రిపులం, సమ
తా జీవన జ్యో
తిశ్శిఖలం  స్వతంత్ర॥

క్రమ ఘూర్ణ జల
సముద్రాల నవ
సమాజ నౌకా
చోదకులం  స్వతంత్ర॥

త్వదీయ హాస
ప్రదీప్తి నాశీ
ర్వదించు మని కో
రే ప్రజలం  స్వతంత్ర॥

కృష్ణవేణి  ఎందరెందరు రాజులు
ఎన్నెన్ని సామ్రాజ్యమ్ములు

కాల దేవుని నిలయ చితిలో
కాలినవి శాస్త్రమ్ములై ఎందరెంద॥

ఎన్ని ఎన్నో సంస్కృతులు
ఎన్నెన్నియో నాగరికతల్
ఛిన్నమై విచ్ఛిన్నమై అయి
యున్నవి పురాతన కథల్ ఎందరెంద॥

కాని ఎవ్వరు నాకు గృహమును
కట్టుటే తలపెట్ట లేదు
నాకు సుఖపడలేదు పోనా
పలక, నను సుఖపెట్టలేదు ఎందరెంద॥

కరువు కాటకములను పస్తుల
మరణములు కని పడ్చినాను
ఎవరికి కొరగాని నా బ్రతు
కెటులో ఒక్కటు లీడ్చినాను ఎందరెంద॥

ప్రజాశక్తి అవునమ్మా
అవునమ్మా
అన్యాయము జరిగినది
కనియకు, ఆ
వెనకకు జరి
గిన దేదో జరిగినది అవు॥

బలులు శాత
వాహనులు
ఇలాధిపులు
ఆఢ్యకులు
నీ శక్తి గ్రహించలేక పోయిరో
ధీశక్తియె చాల కూరకుండిరో అవు॥

తర తరాలు
తరిగి పోయె
చరిత్ర కడు
కరిగి పోయె
నీ చిద్గీతా సంగీతాలలో
నీ పదముద్రా సంకేతాలలో ||అవు||

రాజులు, రా
రాజులు, అ
బ్దాలు శతా
బ్దాలు ఏలి
చేయలేని కార్యమ్మును చేతుము నీ కొరకై
మోయలేని భారమ్ములు మోతుము నీ కొరకై ||అవు||

నాగార్జునుడు విన్నాను, విన్నాను
విప్లవపు పాట
వీర ప్రజా కోటి
వింటి మీ నోట
వేవే వసంతాలు
విర బూయు తోట
రాలే గగుర్చి ర
త్నాలైన బాట
కృష్ణ వేణమ్మ కో
ర్కెల పసడి కోట
నిర్మింపగా మీరు
నిలచు టీ పూట విన్నాను||

చాలు ఈ ఒకమాట
శ్రవణ పేయమ్ము
క్షణమె ఈ రోజు అ
క్షర శతాబ్దమ్ము

"నను వల మేల్కొల్పి
రను" సంశయమేల
తీర్చి మీ నిర్వాణ
దీక్షాశయము విన్నాను॥

ప్రజాశక్తి అపర బుద్ధావతార
బౌద్ధ సం
ఘారామస్థల విహారా అపర॥

క్షమియించు కోరి నిను
కదలించి లేపితిమి
వెలుగు ఛాయని కాల
వృత్తమును చూపితిమి అపర॥

సూర్య చంద్రులకైన
చూడ చోద్యమై నగ
జల సౌధమును మహో
జ్జ్వల సౌధమును కట్ట
నడుములు బిగించితిమి
నాగార్జునాచార్య అపర॥

ముగ్గు రయ్యలు మెచ్చు
మూర్తమ్ము పెట్టుమా
మూల కంఠ మునకై
నేల చూపెట్టుమా
నీ కన్న పండితుడు
మా కెవ్వరాచార్య
వేగ సెల వీయుమో
నాగార్జు నాచార్య, ॥అపర॥

నాగార్జునుడు ఈ శుభోదయ వేళకన్న
ఈ నవోదయ వేళ కన్న

ఏకశిలా శస్త్రాగారమై మిగు
చేకొనిన ఈ వేళ కన్న
లేదు వేరే మూర్త మన్నది
లేదు వేరే యథార్థ మన్నది
మాత్మ భారతనాటి ప్రాచిన
ఓ తెలుంగు ప్రజాకోటి
త్రిశరణాలు ప్రతిధ్వనించెడి
దీన జనార్తి నినదించెడి
పురము తనోన్న వెలుగు చిందిన
మునిగణాత్ములు ముక్తిపొందిన
నందికొండల లోయలో
అందముల ఈ నేలలో
ముగ్గు నిప్పుడే పోయ రండి
మూల కంఠము నెత్తి తెండి
మీరు కృష్ణకు కట్టదలచిన
మేడపై ఆ కొండమీద
అనద్భుతమ్ముగు బౌద్ధశిల్ప క
శాలయున్ను కట్ట రండీ
అద్భుతత నే నహర్నిశలగు
అచట వెలసి తరింతునండీ
సెలవు నాకిక కృష్ణవేణీ
స్వప్న సాగర మౌదునండీ

[నాగార్జునుడు అదృశ్యుడై పోతాడు కృష్ణవేణి కనుమరుగై పోతుంది]

నేపథ్య కంఠం అదె స్వతంత్ర విహాయస విహారి జవహారుడు
ఎగసి వచ్చెను ఎత్తె మూలకంఠము నదే
"ఇది మీరు వెలిగించిన దీపం
ఇది కోటి కోటి కలలకు రూపం"
అని మ్రోగె నదె ప్రజాగళ శంఖం
విని, పొంగులెత్తె నెహ్రూ అంతరంగం

[అప్పుడు సాగర సౌధ నిర్మాణంలో ప్రజాశక్తి విజృంభిస్తుంది]

ప్రజాశక్తి రండి! రారండీ వెలుగు
జండా ఎగరేయండి!
కృష్ణమ్మ ఎద నిండే
ఖిల్లా నిర్మించండీ
బండ నెత్తుకొని రండి
బంగార మదే నండి
సుత్తెలు ప్రయోగించండి
సుర దుందుభు లెందుకండి ||రండి||

యంత్రాలను వాడండి
ఎముకల విగి చూపండి
హాలాహలముల నుండే
అమృతమ్ములు పిండండీ ||రండి||

పాతాళ మ్మంటు దాక
పునాదులను త్రవ్వండి
ఆకాశము నంటుదాక
ప్రాకారము కట్టండి ||రండి||

కంటకాల నెట్టి పాల
కాలువలను పెట్టండి
సాగరాల కొట్టి జీవ
సాగరాలు కట్టండి

[కృష్ణవేణి తిరిగి రంగంలో ప్రవేశించి సంపూర్ణమైన సాగరసౌధాన్ని చూచి]

కృష్ణవేణి ఆహా! ఆహా! ఎంతటి
అమర పురాలయ మిది
విద్యావిజ్ఞాన శక్తి
విజయ పురాంగణ మిది
నే కన్న కలకన్న

నేత్ర పర్వ మ్మిది
నేలకును నింగికిని
నిండు గర్వమ్మిది
ఆ కొండ పై నేమి
వై కుంఠమా అది
ఈ లోయదరి నేమి
కై లాసమా ఇది
ఏదీ బౌద్ధారామము
ఏడీ నాగార్జునుడు?
ఓహో ఆ కొండమీద
ఉన్నారా!
కొండమీద నేమిటి నా
గుండెలోనె ఉన్నారే!
చిత్ర చిత్రమైన ప్రకృతి
చిత్రాలే దిశల యందు
మయ సభ ఏమాత్రము, ఈ
మహిమా భవనము ముందు?

ప్రజాశక్తి నీ ఆశలు, ఆశయములు
నిండిన సాగర మిదే
రాగ రసానంద సుధా
సాగర సౌధమ్మిదే
సేవలకై నీ ముంగిట
నావలు నియమించాము
ఆటలకై పాటలకై
తోటలు వేయించాము ||నీ ఆశలు||

నీ నవజీవన శోభలు
నీ నవభావన రూపులు
చూడవచ్చినా రదిగో
సుందరతా పిపాసువులు ||నీ ఆశలు||

నీ మహిమలు నీ మమతలు
ప్రేమతోడ చిత్రించె
కవులు, క్రాంతి కాముకులు
కళాకారు లల్లరుగో ||నీ ఆశలు||

కృష్ణవేణి ఏదారి చూచినా
కేదారమే —
ఏ మ్రోడు తాకినా
పూ మేడయే —
నాచూపు లెటు ప్రాకి
నా పచ్చలే —
నా అందె లెట మ్రోగి —
నా అందమే— ||ఏదారి||

నాపాట ప్రవహించి
నా కాల్వలై
నా ఆట దీపించె
నా కాంతులై — ||ఏదారి||

పల్లెలకు పేటలకు
ఢిల్లీ దాకా
నాకీర్తి నా వార్త
ప్రాకినదిగా —
నాగార్జుని మంత్ర ||ఏదారి||
యోగ బలమో ?
నా గవేషణ ధర్మ
యాగ ఫలమో ?
తీరె నా వెతలన్ని
తీరె ఈ దినము
తీరిచెద వీర ప్రజ
లార మీ ఋణము ||ఏదారి||

సాగరసౌధం

[అంతట ప్రజావాహిని కృష్ణవేణి చుట్టూ తిరుగుతూ బృందగానం చేస్తుంది]

బృందగానం జయ జయ సాగర సదనా
జయ విద్యుత్ స్మితవదనా
జయ ధ్రువతారా రదనా
జయ కృష్ణాంబుద కేతన
జయ తెలుగు ధరా భూషణ
జయ భారత జన పోషణ
జయ దరిద్రతా భీషణ
జయ ప్రజా విజయ ఘోషణ।



# భారతీయ నృత్యకళ

నటరాజ రామకృష్ణ

యక్షగానాలు

నృత్తం, నృత్యం, అభినయము, అని మూడు విధములు అందు అభినయము, ముఖ్యంగా సాత్వికాభినయము ఉత్తమోత్తమమైనట్టిది భారతీయ నృత్యకళావేత్తలు ప్రపంచ నృత్యకళకు సమర్పించిన అమూల్యరత్నం అభినయ కళ — ఆ అభినయకళను ఒక విశిష్ట కళారూపంగా కళాలోకానికి సమర్పించిన వారు తెలుగువారు క్షేత్రయ్య పదముల రచనతో ఈ సాత్వికాభినయ విధానము పెంపొందినది క్షేత్రయ్య కృష్ణాజిల్లాలోని మువ్వపురి వాసు మువ్వలోని గోపాలునిపై కొన్ని వేల పదములు రచనచేసి తద్వారా సాత్వికాభినయాన్ని ఒక ప్రత్యేక కళాంశముగా పెంపొందింప జేసినాడు క్షేత్రయ్యకు పూర్వం సాత్వికాభినయ మున్ననూ ఇంతటి విశిష్ట రచనలు మనకు మరే భారతీయ భాషలలోనూ కన్పించవు

యక్షగానము రెండు విధములుగా నున్నది ఒకేపాత్ర ఒక ప్రసిద్ధ గాథను నృత్య గానములద్వారా ప్రదర్శించుట కథలోని పాత్రల ననుసరించి బహుపాత్రలు సభ ప్రవేశించి కేళిక చేయుట— ఈ రెండింటికి అనుకూలించు రీతిని 'శ్రీకృష్ణ లీలా తరంగిణి' రచన చేసినవారు నారాయణ తీర్థులవారు 'శ్రీకృష్ణ లీలా తరంగిణి' లోని పాటలను తరంగము లంటారు

క్షేత్రయ్య పదములు భావ, రాగ ప్రాధాన్యత కల్గినట్టి రచనలు పదములు విలంబిత లయ కల్గి ఒక్కొక్క రాగములో ఒక్కొక్క భావమును ఎన్నో విధాలుగా సంచారము చేయుటకు అనువైన రీతిలో వుండును

తరంగములు తాళ, లయ ప్రాధాన్యత కల్గినట్టి రచనలు

తరంగములు తాళలయ ప్రాధాన్యత కల్గినట్టి రచనలు, చిత్ర విచిత్ర గతుల తాళ విన్యాసము లయ పోకడలు, జతుల, యతుల, జాతుల, గతుల ఛందోరీతుల నృత్యముద్వారా ప్రదర్శించుటకు అనువైన పాటలు తరంగములు



# విశాల భారతి

ఏడిద కామేశ్వరరావు

[విశాలము, సువిశాలము అయిన మన భారతదేశం – అనేక మతాలకు, భాషలకు, సంస్కృతీ విజ్ఞానాలకు నెలవై భిన్నత్వంలో ఏకత్వాన్ని పెంపొందించి, అపురూపమైన ఒక జనజీవన మహాప్రస్థానాన్ని రూపొందించింది అట్టి మనదేశంలోని కొన్ని రాష్ట్రాలకు ప్రతినిధులుగా – బాలలు, వివిధ ప్రాంతీయ వస్త్ర ఆహార్యాలంకరణలతో విశాల భారతి అనే ఈ నృత్య రాగమాలికను నర్తించి, 'అందరమూ ఒకటే' అని ప్రబోధిస్తారు తరతమ భేద రహితమైన బాలల అమృతహృదయాలకు ఇది ఒక కళోపహారం !]

విశాల భారతి విజ్ఞాన భారతి
విస్తృత జనగణ మంజులగాత్రి—

అస్సాము తూరుపు ఆశారేఖగ, ఉత్తర
కొండ శిఖరమున కోలికి పూనగ
తేయాకు పంట తైల సంపద
నాగా సంస్కృతి మణిపురి నృత్యము
కళా శోభితము అస్సాము రాష్ట్రము

వంగదేశము వంగభూమి యది రంగభూమిగా
సకల కళలకు సకల విద్యలకు
నవ భారత విజ్ఞాన విప్లవ
నవ భావోద్యమ నవ నాయికగా ॥వి॥

బీహార్ గంగా గండకి సంగమ ఫలితము
సారనీరముల సస్య శ్యామలము
బౌద్ధ క్షేత్రముల పుణ్యభూముల
విహారమ్మది బీహారమ్మ ॥వి॥

ఉత్కళ ఘన పూరీ జగన్నాథ క్షేత్రములు
కోణార్కమున కోటి శిల్పములు
కొండలు కోనలు దండకాటవులు
ఉత్కళమ్మది ప్రాచీనమ్మ ॥వి॥

ఆంధ్ర త్యాగయ నన్నయ క్షేత్రయ గోపయ
గీత సంగీత నటన నాట్యముల
రంగ త్రిలింగ దేశము మాది
దక్షిణావనికి దక్షత గూర్పగ ॥వి॥

తమిళ ఆది ద్రావిడ ఆది సంస్కృతికి
ఆలవాలమై అది చెలగుచుగా
ధీవిశాల విజ్ఞాన గోపుర
మనవెలుగు మన తమిళజాతి గన ॥వి॥

కేరళ

శోభామయ మా ప్రకృతి
సాగర సంస్కృతి సుకృతి
సకల కళలు కలబోసిన ఘనత
సుందరాంగమది కేరళము ॥౧॥

కర్ణాటక

బంగారమ్మది సింగారమ్ముగ
చందనమది చక్కందనమ్ముగ
వీరశైవము విస్తృతకళలకు
మిన్నయైనది కన్నడ దేశము ॥వి॥

మహారాష్ట్ర

జానకళలు మరి జానపదములు
శూరవీర ఘన కదన పాండితి
మరాట కీర్తికి మణిదీపమ్మై
నవభారత నవ కాంతి పుంజము ॥వి॥

గుజరాత్

యమునా తీరే
కన్నయ్య మురళీ గానముదే! -
కన్నయ్య మురళి మ్రోగే!
కృషి వాణిజ్య గోరక్షణ
ధర్మమ్ముల పాలించు గుజరాతు చూడి ॥వి॥

రాజస్థాన్

ఇదమ్ ధర్మము ఇదమ్ క్షాత్రమను
మహాసంస్కృతిని మహిని వెలయించుచు
ఖడ్గమె కలగంగ సిథిరచించెను
రసపుత్రులగన్న రాజస్థానమది! ॥వి॥

ఉత్తరప్రదేశ్

రాజ రాజ మహా రాచరికమ్ముల
రాణ కెక్కిన రాజధానియై
కురుక్షేత్రమది ధర్మక్షేత్రమది
ఢిల్లీ నగరము ఉత్తర ప్రదేశము ॥వి॥

పంజాబ్

పాంచాలమ్మది పంచ నదులతో
పంచసీమలకు ప్రతినిధిగా

ప్రేమాను రాగ ధీర శూరగుణ
మక్కుజమగు మా శిక్కుజాలి గన ||వి|

హిమాచల ప్రదేశ్ హిమాచలమ్మది మహామాచలము
హిమశైలమ్ము శివశైలమ్ము
భారత సంస్కృతి మణికిరీటము
భారతీయ జవజీవన శృంగము ||వి|

కాశ్మీరము కమనీయమ్ము కాశ్మీరమ్ము
పూలు ఫలములు వెన్నముద్దలట
హిమవన్నగమున భూతల స్వర్గము
మంచు శోభల మించు స్వర్గము ||వి|

ముద్దుబిడ్డలు హిందూ రాజ్యము నేపాళమ్ము
బౌద్ధ రాజ్యములు సిక్కిమ్ భూటాన్
అండమానులు, లక్షద్వీపములు
భారత మాతకు ముద్దుబిడ్డలు! ||వి|

ఛప్పన్న దేశాలు అంగ వంగ కాశ్మీర కళింగ
ఘూర్జర ద్రావిడ ఆంధ్ర కన్నడ
కేరళ మరాట మణిమాలలుగ
భారత భారతి మంగళహారతి!

మతమాలికలు హిందూ బౌద్ధము ముస్లిము క్రైస్తవ
జైన పారశీక మతసంస్కృతులు
ఏడురంగుల ఇంద్ర ధనుసువలె
నెమలి పింఛమై విరిసె భారతము! ||వి|

[బాలలందరు చెట్టాపట్టాలు పట్టుకొని నృత్యముచేస్తూ పాడతారు]

అందరమూ ఒకటే
మన మందరమూ ఒకటే!
మన మందిరమూ ఒకటే! —

అందరమందా నందము లొలుక
సుందర భారత
నందన మందున ॥అం॥

అందరి చరిత్ర ఒకటే
అందరి ప్రవర్తనొకటే ।
భావిచరిత్ర ప్రవర్తన మంతా
ఒకటే అంటూ వ్రాయుదమింకా ॥అం॥

భాషలువేరు । భావము లొకటే ।
భాషల తల్లి । సంస్కృత మొకటే ।
భాష భావముల భేదములున్నా
భారతహృదయము అంతా ఒకటే । ॥అం॥

మతములు వేరు మనుగడ ఒకటే ॥
జాతులు వేరు నీతులు ఒకటే ॥
మతములు జాతులు వేరుగనున్నా
భారతీయమది అందరిదీ ॥అం॥

విద్యలు ఒకటే । కళలు ఒకటే
వినోద విజ్ఞానమ్ములు ఒకటే
భిన్నత్వమ్మున ఏకత్వమ్మై
వివిధభారతి హృదయమొక్కటే ॥అం॥



# మార్గి - దేశి

నటరాజ రామకృష్ణ

శాస్త్రీయ సంగీతము మార్గి, దేశి అను రెండు రీతులు. కేవలము శాస్త్రీయ పద్ధతుల్లో ప్రచారమయ్యే సంగీతం మార్గరీతి.

అటుగాక ఆయా ప్రాంతీయ ప్రజల అభిరుచుల ననుసరించి రూపొందిన అనేక సంగీత రచనలు దేశిపద్ధతికి చెందినట్టివి. ఈ సంగీతాన్ని ఛందో గానమనవచ్చును.

ద్విపద, ద్విపదార్థము, కందము, కందార్థము, సీసము, సీసార్థము, వృత్తము, వృత్తార్థము, చరణము, ప్రబంధములు, పదం, హెచ్చరికలు, త్రిపుటలు, రగడలు, తోహరాలు, [illegible], సువ్వాలలు యిత్యాది రచనలన్నీ దేశి సంప్రదాయానికి చెందినవిగా చెప్పబడును.

ఈ దేశి సంగీత కలాప ప్రబంధములందు గాంచవచ్చును. ఈ పద్ధతిలో పారిజాత ప్రబంధము రచించి కళాలోకానికి 'కలాప' రూపంలో అందించిన వారు యోగి సిద్ధప్ప లేక సిద్ధేంద్ర యోగి. కూచిపూడి కూచిపూడి బ్రాహ్మణులు ఈ కలాప సంప్రదాయంలో చేయబడిన రచన - భామా కలాపము - నేర్పించి, వారిద్వారా కృష్ణభక్తి భాగవత ప్రచారము గావించినారు. నాటినుండి వారు భాగవతులైరి.

భాగవత కళ ద్వారా దేశి సంప్రదాయ సంగీత బాణీ, తదనుకూలమైన నర్తనము అభివృద్ధి గాంచినది.

ఈ సత్యమును గ్రహించిన భారతదేశ కళా చరిత్ర పరిశోధకులు 'తెనుగు దక్షిణాది సాంస్కృతిక భాష' అని పేర్కొన్నారు.

# గోదావరి

## నండూరి రామకృష్ణమాచార్య



### తలు

1 సూత్రధారి నందీశ్వరుడు
2 నటరాజు
3 గౌతమర్షి
4 సముద్రుడు
5 గోదావరి

### స్తావన

గోదావరి నది పుట్టుక, దినచర్య, పరీవాహక ప్రాంత విశేషాలు, సాగర సంగమము - మొదలైన విశేషాలను నృత్యగాన రూపములలో చిత్రించు నృత్యనాటిక

[గౌతమర్షి తపోముద్రా ముద్రాంకితుడై యుండ నటరాజు సాక్షాత్కరించి లీలా తాండవము సల్పును]

సూత్రధారి నందీశ్వరుడు

నాట

జడల మిన్నేటితుంపురుల్ చదల చెదర
సహ్యగిరి, మలిసంజకెంజాయ కెరలి,
నింపుచుందువు నిష్ఠేద నిత్య నృత్య
కేళికా హేళి బ్రహ్మాండగోళమెల్ల!

శివతాండవము

ఆది బహుదారి

జయ జయ జయ జయ జయ నటరాజా!
సాయం సంధ్యా పాటల తేజా!
ఆనందామృత రసమయచిత్తా!
తాళలయాన్విత తాండవమత్తా!
జయ జయ గంగా శృంగారవతీ
సంగీతాంకిత మంగళజూటా!
జయ జయ మీలిత ఘన మహిమాలయ
లయనయనాంకిత లలితలలాటా! ॥జయ॥

జయజయ నూతన తారానాయక
లలితజ్యోత్స్నా విలసిత మౌళీ!
జయజయ సృష్టి స్థితి లయలీలా
నాటక హేళీ కీలిత కేళీ! ॥జయ॥

జయజయ ఢంకా ఢమరుక సంకుల
నూపుర ఝుణఝుణ నిక్వణ చరణా!
జయజయ మామక శరణాగతియుత
నవతా తాండవ కవితా భరణా! ॥జయ॥

సూత్రధారి నందీశ్వరుడు

బిళ్హరి

దరహాసస్ఫుట పాటవ ప్రకట సంధ్యానాట్యమృత్యుంజయే
శ్వరకోటీరజటాకుటీపటుతటీచంచద్వియద్గాంగని
ర్ఝరఘుంఘుంచటులచ్ఛటార్భటులు విశ్వంబెల్ల మార్మ్రోగె,నీ
చిరదీక్షాతపముల్ ఫలించె నిను మెచ్చెన్ వచ్చె విశ్వేశుఁడే।

శివతాండవము

సూత్రధారి నందీశ్వరుడు

బేగడ

గౌతమమునీంద్ర! కనవయ్య కనులు విప్పి,
తరలివచ్చెను నటరాజె, తపము మెచ్చి
కెరలి నీముందు తాండవకేళి సలుపు ,
కోరుకొనవయ్య, వరమేదొ కోరుకొనుము

[గౌతమముని శివవందన నృత్యము, వరప్రార్థన]

సూత్రధారి నందీశ్వరుడు

ఆరభి

నందీశ్వరు డాగతి అభి
నందింపగ గౌతమర్షి నాథు డమందా
నందస్పందితమతియై
వందన మొనరించి శివుని వర మర్థించెన్

గౌతమఋషి

శంకరాభరణ

పావనమూర్తి! నా చిరతపస్సులు పండె, నితాంతభవ్య గం
గావిమలాంబుబిందువులు కమ్మని నీ జడ వీడి వచ్చి, గో
దావరి యౌచ దక్షిణపథంబు సుభిక్షము చేయుగాత! నా
కీ వర మిమ్ము వేడెద మహేశ్వర, నిన్ను జగద్ధితంబుగన్

[శివతాండవము వరప్రదాన నృత్యము]

సూత్రధారి నందీశ్వరుడు

ఘనపంచక రాగమాలిక

ఆది నాట

గౌతమమునివర కౌతుకమును గని
పెదవుల విరిసిన మృదుహాసముతో
ధిం ధిమి ధిమి ధిమి ధీం ధీం ధిమి ధిమి
ఢం ఢమ ఢం, ఢమ ఢమరుధ్వనితో
నటరాజంతట పటుహర్షోత్కట
నవరసభంగుల నాట్యముచేసెన్

గౌళ

నభమున దుందుభినాదము మొరసెను
పుష్పాలవర్షము పుడమిని కురిసెను
తళతళ మిలమిల వెలుగులు గ్రక్కుచు
చుక్కలు పెక్కులు దిక్కుల మెరసెను

ఆరభి

లీలాతాండవలోలుని జడలో
బుసబుస పొంగుచు చెంగున రంగత్
తుంగతరంగ విభంగుర గంగా
బిందువు ఋషివను సుందర చిందెన్

వరాళి

సుందర చిందిన బిందువు చెచ్చెర
భుగభుగపొగయై ధగధగ వెలుగై
కన్నుల యెదుటను కలకలలాడెడి
కన్యాసుందరి రూపము నొందెను

[శివుని జటాజూటమునుండి చిందిపడిన బిందువు గోగగా మారినప్పుడు, ఆ ధూమయవనికాభ్యంతరమునుండి గోదావరీ కన్యక ప్రవేశించి నృత్యముసల్పును ]

శ్రీ

సద్యోయౌవన విద్యుల్లోచన
గౌతమమునివరు గాదిలి కూతుగ
గోదావరి సుమకోమలహృదితో
పదునాలేడుల పడుచై యొప్పెన్

సూత్రధారి నందీశ్వరుడు

సురటి

పరమ విశ్వజనీన జీవనము నీది!
నవ్యలావణ్య లహరివై నాట్యమాడి,
అన్నపూర్ణవై, అందరి నాదరించి
ఉద్ధరింపగలవు దక్షిణోర్వినెల్ల!

[శివుని ఆశీర్వాద నృత్యము అందరు నిరీక్షించెదరు
గోదావరి కన్య నృత్యము ]

మోహన రూపక

గోదావరి పెరిగె నహో!
గోదావరి యెదిగె నహో!
మీననేత్ర ఫేనగాత్ర
సర్వరాష్ట్ర సౌఖ్యసూత్ర
మానవకళ్యాణయాత్ర
మునిజనీన ముఖ్యపాత్ర ॥గోదావరి॥

చేరడేసి కందమ్ములు
చిన్నినడుము అందమ్ములు
వాలు జడల ఒయ్యారము
మేలి నడల సింగారము ॥గోదావరి॥

కన్నెకోమల వంపులతో
సుడుల నాభి సొంపులతో
కలికి నవ్వు కులుకులతో
చిలిపి సిగ్గు తళుకులతో ॥గోదావరి॥

సోగ ముక్కు సొగసుతోడ
కలలు గనెడి కనులతోడ
మించు తీగె మేని సొలగు
మించు మంచి మనసుతోడ ॥గోదావరి॥

[గౌతమఋషి ప్రవేశం ఆశీర్వాద నృత్యం ]

గౌతమఋషి ఆనందభైరవి

క్రొన్నెల తాల్పువేల్పుకృప కొల్లలు కొల్లలు! నా తపస్సుచే
కన్న కుమార్తెవై వెల కారణజన్మ ధరించినావు, నీ
వన్నెకు వాసికిన్ తగిన వానిని, ధైర్య సముద్రుదు, భర్తగా
ఎన్నిక చేసి తెత్తు, విహరింపకు పశ్చిమదిక్కు వైపుగన్

గోదావరి నృత్యము

గౌతమఋషి యదుకుల కాంభోజి

అత్తవారింటి కడకు ని న్నంపవలయు
మార్గమంతయు శోధించి మరలివత్తు,
సాకుచుండును నా తపశ్శక్తి నిన్ను,
తల్లి! నేను గీచిన గీటు దాటకమ్మ!

[గౌతమముని ఆశీర్వాద నృత్యంతో నిష్క్రమణ ]
గోదావరి దినచర్య నృత్యం
రాగమాలిక ఝంపె

గౌరిమనోహరి

తియ్యగా గోదారి దినచర్య దిద్దింది
ఓరంత ప్రొద్దింత విశ్రాంతి వద్దంది
చిన్నారి పొన్నారి చిరుతకూకటినాడె
అందాల కాణాచియై ఆరితేరింది

ఝేః

తొలి ఉషస్సులలోన పులకించి లేచినది
అలుపుముందు కస్తూరి కలయంపి జల్లినది
కర్పూర ధూళికా కాంతిరింఛోళితో
ముత్యాల కోవతా ముగ్గుసరు అల్లినది

కాంభోజ

తెల్లవారగ వెల్లి తేటి కందళముందు
పూజకై వనిలోన పుష్పాలు కోసినది
గొజ్జంగి పన్నీట మజ్జనము సల్పినది
నెలవంక సొంపుతో తిలకమ్ము తీర్చినది

మణిరంగు

రంగారు బంగారు చెంగల్వ పూరంగు
పట్టంచు కెంగావి పుట్టంబు కట్టినది
నెన్నడుము చుట్టునా నృత్యమ్ము చేసేటి
మురిపంపు ముత్యాల మొలనూలు పెట్టినది
మించువెల్గుల కళ్లు మిరుమిట్లు గొల్పేటి
వజ్రాల నగకట్టు వన్నె చేపట్టినది

నాటకురంజి

నీలాటిరేవులో వాలారు కెరటాల
నిండారు కుండతో నీరు కొనితెచ్చినది
ఆశ్రమంబును చేరు అభ్యాగతులకెల్ల
అర్ఘ్యపాద్యాలతో ఆతిథ్య మిచ్చినది

పూర్వకల్యాణి

పూలమొక్కలకెల్ల పొద్దుగ్రుంకెడివరకు
అల్లారుముద్దుగా నీళ్లెత్తిపోసింది
మల్లిపొద్దు కెంజాయ తొలిచుక్క పొడువంగ
చిన్నారి గోదారి చేయెత్తి మొక్కినది

నీలాంబరి

గోరంతదీపమ్ము కొండంతయై వెలుగ
మునిమాపు సమయాన మొగసాల నిల్చినది
అన్ని పనులూ చేసి వెన్నువాల్చినతోడ
సొమ్మసిలి గోదారి సుఖనిద్ర పోయినది

సముద్రుడు ప్రవేశము

బృందావనసారంగి    రూపక

కోరికోరి గోదావరి
కడకు వెడలె కడలిఱేడు
సరస రసికచక్రవర్తి
శంఖచక్రచారుమూర్తి
కరగి కరగి పెరిగి పెరిగి
తరిగి తరిగి తిరిగి తిరిగి
పొరలి పొరలి పొంగిపోయి
కెరలి వెడలె కడలి ఱేడ ॥కోరికోరి॥

రత్నాకర బిరుదాంకుడు
రాగ భోగ మకరాంకుడు
నిత్యనూత్న యౌవనుండు
నిఖిలజగజ్జీవనుండు ॥కోరికోరి॥

సిరులకు నెలవగు వాడట
సురలకు సుధలిడు ఱేడట
నిరత విరహ బడబానల
భరితహృదయు డైనాడట ॥కోరికోరి॥

కల్పవృక్ష కామధేను
చింతామణి కాంతి
చంద్రజ్యోత్స్నాలాలిత
లక్ష్మీలావణ్యుండట ॥కోరికోరి॥

## గోదావరి ప్రవేశం

కుంతలవరాళి ఝంప

ఉయ్యాల లూగింది ఒయ్యారి గోదారి
సహ్యాద్రి వనిలోన నెయ్యాట లాడినది
చిన్నారి పొన్నారి వన్నె చిన్నెలకన్నె
కలువరేకుల వాలుకనులెత్తి కాంచినది
ప్రత్యూషపవనాల నిత్యయౌవనరాజ్ఞి
లావణ్య లహరియై లాస్యాల మించినది

[గోదావరి నృత్యం సముద్రుని ప్రవేశం]

నూనూగు మీసాల నూత్నయౌవనమూర్తి
కడలి తేడరుదెంచ ఎడద పొంగులు వారి
కడగంటి చూపుతో కర్పూరహారతుల్
అర్చించి పూజించి ఆతిథ్య మిచ్చినది

సముద్రుడు ఆభేరి

వినుకలి కూర్మిచే విరహావేదన చెంది తపించి వచ్చితిన్
ఘనసికతావిశాలజఘనా! నిను చూచిననాటినుండియున్
కని విని యుండనట్టి వలకాకల చిక్కి కృశించినాను నా
వెనుకటి పేర్మి పెంపు కనిపించును నీ నును కౌగిలింతలన్

[గౌదావరి, సముద్రుడు నిష్క్రమణం]

దేష్

ఓ నవనీతయౌవనవయోరుచిరాంగి! హృదంతరాన
వేసవి మల్లెతావి వెరవిచ్చగ రేపె మనోజ్ఞ వేదనల్
నీ నును లేతబుగ్గ పసనిగ్గుల చిందిన మందహాస శే
ఖానవసాంధ్య కాంతికళికల్ చిరుసిగ్గు మిటారి చూపులున్

[సముద్రుడు, గోదావరి యుగళనృత్యం]

రాగమాలిక ఆది

సముద్రుడు

రుద్రప్రియ

ఆటలు ఆడుచు పాటలు పాడుచు
నాతో రావే నవరస లహరి
నిత్యవసంతము నృత్యము చేసెడి
కిలికిలి నవ్వుల కెలిగన్నులతో ॥ఆటలు ఆడుచు॥

గోదావరి

ఆటలు ఆడెద పాటలు పాడెద
గీటును నాయన గీసెను లేదిట
ఆయన అనతి మేరను మీరను
పడమటి దిక్కుగ అడుగును వేయను ॥ఆటలు ఆడెద॥

సముద్రుడు

కేదార

ఆకులు రాలక పూవులు వాడక
నిలుకడగల మించుల తీగెలతో
ఆమని ఋతువే పాయక నిల్చెడి
లోకము చేర్చెద లోలాక్షీ నిను ॥ఆటలు ఆడుచు॥

గోదావరి

ఆకులు రాలక పూవులు వాడక
నిలుకడగల మించుల తీగెలతో
ఆమని ఋతువే పాయక నిల్చెడి
లోకమ్మును హృదిలో నే గోరను ॥ఆటలు ఆడెద॥

సముద్రుడు

కమాన్

కొండలు చూపెద కోనలు చూపెద
పులిచానల పొలిమేరలు చూపెద
అంకిలి చెప్పక అనురాగముతో
ప్రియ రత్నాకరు పెండిలియాడవె ॥ఆటలు ఆడుచు॥

గోదావరి

కొండలు చూచితి కోనలు చూచితి
పులిచానల పొలిమేరలు చూచితి
నాయన గీసిన గీటును దాటను
పడమటి దిక్కుగ అడుగులు పెట్టను ॥ఆటలు ఆడెద॥

సముద్రుడు

ఆనందభైరవి
భద్రగిరీంద్రము పంచవటీస్థలి
పాపికొండ లను పర్వతపంక్తులు
ఉష్ణజలాశయ ముగ్రవనాగ్రము
ఉజ్వలభావిని ఉన్నతి చూపెద ॥ఆటలు ఆడుచు॥

గోదావరి

భద్రగిరీంద్రము పంచవటీస్థలి
పాపికొండ లను పర్వతపంక్తులు
ఉష్ణజలాశయ ముగ్రవనాగ్రము
ఉజ్వల భావిని వున్నతి కోరను ॥ఆటలు ఆడెద॥

నందీశ్వరుడు

భైరవి

క్వణదణుకింకిణీకలితకాంచనకంకణకాంచిదైయై రణన్
మణిమయశింజినీప్రకటనర్తన గాన ఝుళంఝుళద్ విలా

సిని యయి జాళువా చిలిపి సగ్గుల మేలిముసుంగు జార్చుచున్
ప్రణయిని ఆర్ద్ర కన్య పొరపాటున దాటెను తండ్రి గీటహో!

[గోదావరి నిష్క్రమణం]

నందీశ్వరుడు

శుద్ధసావేరి

గీటు దాటి గౌతమి నృత్యకేళి కెరలి
ఏరుగా నీరుగా మారి పారసాగె
కన్నె గోదారి నిలువెల్ల కరగిపోయె
వెడలె కృతకృత్యుడైన ఆ కడలిఱేడు

నందీశ్వరుడు

కానడ చాపు

మారినది గోదావరి ఝరి
చేరినది నది ఉదయగిరి దరి
మేఘగర్జన మింట మ్రోసెను
కుండపోతగ కురసె వర్షము
హోరుగాలికి మారుమ్రోగెను
భూనభోంతర దిగ్దిగంతము ॥మారినది॥

దద్దరిల్లెను ధారుణీస్థలి
ఘూర్ణమయ్యెను కొండకోనలు
మిట్టపల్లము మట్టమయ్యెను
గౌతమీ పదఘట్టనమ్మున ॥మారినది॥

తప్తహృదితో సుడులు తిరుగుచు
సప్త ఋషులకు సాగిమ్రొక్కెను
కంపమొందుచు కంటినీటను
గౌతమర్షికి కాళ్ళు కడిగెను. ॥మారినది॥

[గౌతమముని ప్రవేశించి]

సౌరాష్ట్ర

పుణ్యభూమి అస్త్రాద్రి నీ పుట్టినిల్లు,
తల్లి! మెట్టవే ఉదయాద్రి దరులు దాటి,
సప్తఋషివరేణ్యులు నిన్ను సాగనంప,
కదలితేదు నిన్ లాలించి కౌగిలించు!

మధ్యమావతి

ఆడబోవు తీర్థ మ్మెదురైనయట్లు,
తల్లి! రత్నాకరుండె నా అల్లుడయ్యె,
గుణసముద్రుని భర్తగా కోరుకొంటి
వమ్మ గౌతమి! దీర్ఘాయురస్తు మీకు!

(తెర)





# సింహం ఎలుక

కొలకలూరి ఇనాక్

## పాత్రలు

సింహం

ఎలుక

## రంగాలంకరణ

అడవి, చెట్లు, ఆకులు, పొదలు అలంకరణ

## ప్రస్తావన

సంగీతం   సింహం గొంతుకోసం పురుష స్వరం   ఎలుకకు స్త్రీ స్వరం

వ్యాఖ్యానించే వ్యక్తిస్వరం

[తెర లేచేసరికి పూర్తి అయ్యేట్టుగా వ్యాఖ్యాత పాట  అడవి దృశ్యం ]

చీమలు పోలేవు గాని
చిట్టెలుకలు తిరుగుతాయి
కాకులు రాలేని చోట
సింహాలే దూకుతాయి
అదిగదిగో చిట్టడవి
కారడవి
ఎన్ని చెట్లు, ఎన్ని పూలు
ఎంత అల్లిబిల్లి లతలు

[సింహం ప్రవేశం కళ్ళు నలుంకొంటూ వుంది ]

అడవి అంతా నాదే
రాజునంటే నేనే
తిరిగి తిరిగి అలిసిపోతి
చెట్టు నీడ అహో సుఖం ||అడవి||

కళ్ళు మూత పడితే
నిద్ర ఎంతో హాయి హాయి ||అడవి||

రవంత సేపు నిద్రపోయి
లేచి అడవి పలుకొందు ||అడవి||

[సింహం చెట్టు నీడలో నిద్రపోయింది  గుర్రుపెట్టింది ]

[ఎలుక ప్రవేశం  చలాకీగా దూకుతూ, ఎగురుతూ, ఆగుతూ, చూస్తూ వుంది ]

చేయి వేస్తే ఉరిమి చూచే
గాలి వేస్తే పంజా ఎత్తే,
సింహమేనా నేల మీద
అయ్యోరామ సింహమేనా ||సింహ||

అవిగో పురుగులు
ఇవిగో దోమలు

అల్లవిగో ఈగలు
ఇవిగివిగో చీమలు
ఎన్ని ఎన్ని ముఖము మీద
ఎగిరిన నడిచిన దూకిన కదలని ||సింహా||

సింహారాజు జూలు మీద
కాలు పెడితే మేలు మేలు
సింహారాజు కోర పన్ను
గిరి చూస్తే ఒహో ఒహో ||సింహా||

వ్యాఖ్యాత ఎలుక కోర్కె విన్న కాళ్లు
సింహారాజు తోక తొక్కె
ఆదమరచి నిదురపోవు
సింహమేమొ కదలలేదు

ఎలుక తెలివి కొద్ది వెళ్లి
నడుంమీద రివి చూపె
ఆదమరచి నిదురపోవు
సింహారాజు కదలలేదు

జూలు పట్టి ఊయెలూగి
ఎలుక ఆడుకొంటు ఉంది
ఆదమరచి నిదురపోవు
సింహమేమొ కదలలేదు

కోరపన్ను గిరి గిరి
కోరపన్ను గిరి గిరి
ఎలుక ఎగురులాడుతూంది
ఎవరెస్టే ఎక్కినట్లు
ఏరోప్లేనే వెళ్లినట్లు
ఎలుక ఎగురు లాడుతూంది

సింహరాజు కళ్లు విప్పి
చుట్టు చూచె, ఎలుక! అలుక!
పంజా ఎత్తి కొట్టి పట్టి,
ఆదమరచి నిదురపోవు
సింహమేమొ మండిపడెను

సింహం ఏయ్ ఎలుకా చిట్టెలుకా
ఎందుకింత పొగరు నీకు!
ఏయ్ ఎలుకా కలుగెలుకా
ఎంత కండకావరం నీకు!
నా వొంటిమీద ఎక్కుతావా
లెక్క లేక తిరుగుతావా ||ఏయ్||

నేనంటే ఏమనుకొంటివి
చీమన ఈగన దోమన ?
నేనంటే ఏమనుకొంటివి ||ఏయ్||

ఎలుక ఓ రాజా! సింహరాజా!
పొరపాటే చేశాను!
తప్పు పనే చేశాను!
నన్ను చంపవద్దు రాజా ||ఓ రాజా||

మొండిపనీ బండపనీ
చేసినాను విసిగినాను
ఇదిగో లెంపలేసుకొంటి
నా తప్పును మన్నించు రాజా ||ఓ రాజా||

సింహం ఏయ్ ఎలుకా చిట్టెలుకా
ఎలుకా పోరెలుకా
కమ్మని నా జూలు పట్టి
ఊయలే ఊగుతావా?
చక్కని నా కోర గీరి
చప్పట్లే కొడతావా? ||ఏయ్||

ఎలుక తెలివిలేని దద్దమ్మని
పిచ్చి వెర్రి ఎక్క మొండి మొద్దమ్మని
తప్పు తెలుసుకొన్న నన్ను
తమరు దయతో చూడాలి రాజా ||ఓ రాజా||

నాకిప్పుడు బ్రతుకిస్తే
మీకెప్పుడైనా ఆపదొస్తే
కాపాడే ఛాన్సీ నాది ||ఓ రాజా||

సింహం (నవ్వింది అడవి దద్దరించేలా ప్రతిధ్వనించేలా నవ్వింది)

ఏయ్ ఎలుకా తెక్కలుగా!
ఏయ్ ఎలుకా మొండెలుకా!
సువ్వెరుగవ ఈ అడవికి
రాజును నేనే నని
సువ్వెరుగవ ఈ భూమికి
దైవం నేనే నని ||ఏయ్

నాకు కూడా ఆపదా
ఈ అడవిలో
నాకు కూడా చిక్కులా
ఈ నేలలో ||ఏయ్||

ఏలెడంత లేవు నీవు
నువ్వా నను కాపాడేది?
రవ్వంతయున లేని నీకు
గొవ్వెక్కిన మాటలేల? ||ఏయ్||

తెలివిలేని పసుల నిన్ను
చంపట మిదుగో ధాయం
బుద్ధిలేక పలుకు నిన్ను
చంపక తీరదు న్యాయం

ఎలుక  మహో ప్రభో మహో ప్రభో
మహో ప్రభో సింహరాజా!

బుద్ధిలేని దాన్ని నేను
తెలివిలేని మొద్దు దాన్ని
చిన్న మేలు అయినగాని
చేయలేక పోయిన సరే

నా ప్రాణం కాపాడగ
చేతులెత్తి మొక్కుతాను ॥మహో॥

చిన్న దాన్ని చితుకుదాన్ని
పిచ్చి వెర్రి మొద్దు దాన్ని
నన్ను వదిలి పెట్టురాజా!
నా బ్రతుకు నిలుపురాజా ॥మహో॥

సింహం  పో పో పో బ్రతికిపో!
ఎలుకా చిట్టెలుకా ॥పోపోపో॥

పిరికి ఎలుక నిన్ను చంపి
తినేకంటె రోతలేదు
పిచ్చి ఎలుక నిన్ను కొరికి
నోరు మురికి చేసుకోను ॥పోపోపో॥

తెలివిలేక ఉండవద్దు
పిచ్చి ముదిరి తిరగవద్దు
వళ్లు దగ్గరుంచుకొని
నేలచూచి నడుచుకో ॥పోపోపో॥

వ్యాఖ్యాత  ఎలుకా చేతు లెత్తి వొంగి
దండాలే చెప్పింది

సింహరాజు అందంగా
చిరునవ్వే నవ్వాడు

ఎలుక రాజు తోక ముడిచి
పరుగులు తీశాడు
సింహారాజు జూలు నిలిపి
చుట్టూరా చూశాడు

## రెండో రంగం

(తెర లేచే సరికి సింహం వలలో చిక్కి వుంది)

సింహం ఎందుకిలా జరిగింది ?
ఏమిటిలా అయింది ?

అడవికంతా రాజునే
నాకా యీ గతి
పుడమికి నేనే దొరనే
నాకా యీ దుర్గతి ॥ఎందు॥

తెలివిలేని మనిషి ఒకడు
పన్నిన వలలో పడిన నేను
హానిసగా బ్రతుకుతేనా?
చావుకోసం చూచుతేనా ? ॥ఎందు॥

వ్యాఖ్యాత పడ్చి పడ్చి సింహారాజు
సొమ్మసిల్లి పోయాడు
ఎగురుదూకు ఎలుకరాజు
ఎటునుంచో వచ్చాడు

సింహారాజు ఆపద
తెలుసుకొనీ, కాపాడగ
కోరుకొనీ, గతాన్ని
తలచుకొనీ, ఎలుకరాజు
ముందు కురికి వచ్చాడు

చిట్టి పొట్టి పళ్లతో
చిటుకు పటుకు మని
చిట చిట పొట పొట
వలతాళ్లన్నీ కొరికాడు

అటు ఇటు కదులుతూ
ఉక్కు ముళ్లుగా పళ్లను వొత్తి
బిగువు ఉరులనే కొరికాడు

తెగిన వలనూ
కదిలే సింహరాజునూ
ఎలుక హాయిగా చూచాడు

రెక్కలు మొలిచిన పక్షిలాగా
సింహం పైకి లేచాడు
గాలిలో తేలే దూదిగలా
ఎలుకతోడుగా సాగాడు

ఎలుక రాజా! రాజా! సింహరాజా!

సింహం ఏమోయ్ ఏమోయ్ ఎలుకరాజా!

ఎలుక అడవి దొర ఆపదేమి?
కోన రాజా కష్టమేమి?

సింహం ఎలుకరాజా! దండాలు!
చిట్టెలుకా! వందనాలు!

ఎలుక వలకు పల చిక్కినావు
కొండంతటి సింహరాజా!

సింహం జాలి చేసినట్టి ఎలుకా!
నాకు మేలు చేసినావు!
నన్నే కాపాడి నావు!!

నిన్ను వదలి నన్ను నేను
బ్రతికించుకొన్నాను కదా!!

చిన్న వాడివని నిన్ను
చులకనగా చూచినాను

నేలంత లేవని నిన్ను
ఎగతాళిగ తలచినాను

చిన్ని నీవు ఇంత నాకు
ఎంతో మేలు చేసినావు

మేలు చేయ చిన్న లేదు
పెద్ద లేదు

ఎంత పెద్దకయిన బాధ
కలుగవచ్చు

ఎంత చిన్న అయిన మేలు
చేయవచ్చు

మేలు చేసే నీతి నేర్పి
నాకు బ్రతుకునిచ్చినావు
ఎలుకా! చిట్టెలుకా! పొట్టెలుకా!






## పాత్రలు

బాలిక, బాలుడు

## రంగాలంకరణ

నదీతీర వాతావరణం ఉచితరీతి—

బాలిక ఆకసమ్మొంటింది కృష్ణమ్మా!
కేకిసలు కొట్టింది కృష్ణమ్మా!
పొంగి ఉవ్వెత్తుగా
రంగ త్తరంగాల॥

బాలుడు పంతాలు చెలిచింది, వంతుల్లు పోయింది
తగ్గినట్లే తగ్గి వాడి ఎత్తున లేచి॥

బాలిక, బాలుడు ఆకసమ్మొంటింది కృష్ణమ్మా!
కేకిసలు కొట్టింది, కృష్ణమ్మా!

బాలిక పరవళ్ళు త్రొక్కింది, తిరుగుళ్లు తిరిగింది॥
లంకల్లు వుంచెత్తి, హుంకరించింది॥

బాలుడు 'రంయి' మని వాపిచ్చి, ఉయ్యాలలూగింది
వాపు వాపుకు భూమి దద్దరిల్లింది!

బాలుడు, బాలిక ఆకసమ్మొంటింది, కృష్ణమ్మా!
కేకిసలు కొట్టింది కృష్ణమ్మా!

బాలిక చూడు! కృష్ణమ్మ ఉయ్యాల లూగుతున్నట్టు లేదూ?
భయంకరమైన ఉయ్యాల!

బాలుడు అల్లాగే కన్పిస్తోంది!

బాలిక ఊగింది కృష్ణమ్మ ఉయ్యాల
ఉయ్యాలో, వఱద ఉయ్యాల
సన్న సన్నగ పలు సాగిందీ
సాగి సాగీ నింగు రేగిందీ॥

బాలుడు అదుగో!
గట్టులకు ఎగతట్టి తాచిందీ
తాచి తాచీ పైకి లేచిందీ!

బాలిక  లేచి లేచీ కట్టలూపింది
ఊచి నింగికి నిచ్చెనేసింది!

బాలుడు  కుయ్యాల మొత్తోల ఉయ్యాల!
కృష్ణమ్మ కుయ్యాల జంపాల!

బాలిక , బాగా అన్నావు

ప్రజలకు కుయ్యాలు మొత్తోలూ, ఆమెకు ఉయ్యాల జంపాలలు

బాలుడు  మనం ఆమెతో మన గోడు చెప్పుకుందాం

బాలిక  అల్లాగే!

కన్నెఱ్ఱ చేసేవు కృష్ణమ్మా!
నీవు మిన్నంటి చూసేవు కృష్ణమ్మా!
కన్నబిడ్డలు మేము కామా?
నీకింత కనికారమే లేకపోనా?

బాలుడు  ఆలమందల గోల విన్నావా?
ఈ ఆలిబిడ్డల గోడు కన్నావా?
పంటలన్నీ ముంచి వేశావూ!
పైకప్పులే లేపి వేశావు!

బాలిక  గడ్డివాముల దూసి పోశావు!
నీ బిడ్డలపై కత్తి దూశావు!
కన్నెఱ్ఱ చేసేవు కృష్ణమ్మా!
నీవు మిన్నంటి చూసేవు కృష్ణమ్మా!

బాలుడు  కృష్ణవేణిని ప్రార్థిద్దాం!

పాలవెల్లి కృష్ణవేణమ్మా!
చాల్ చాల్ పొంగులు, తగ్గు, మాయమ్మా!
వఱద గుడిసీ చూసి లేచావు,
కొండవాగులకు చేతులే కలిపావు!

బాలిక — నింగికెగసే పొంగిపోయావు!
ఆ పొంగులో ఉత్పాత లాగావు!
ఆగునా శివాలు, మాతల్లీ!
నీ వాగకుంటే కృష్ణవేణమ్మా!

బాలుడు — మన, మొఱాలకించింది కృష్ణ వరద తగ్గిపోతోంది

బాలుడు, బాలిక — పసుపు కుంకుమ లివిగో కృష్ణమ్మా!
ఫలజాతు లివె నీకు కృష్ణమ్మా!
ఝుంకారగుసు మాను కృష్ణమ్మా!
టెంకాయ లివే నీకు, కృష్ణమ్మా!

వరద తగ్గిపోయిందర్రా! ఏదీ దేవత అనుగ్రహం చూపింది








పాత్రలు

నర్తకులు చిలుక, తుమ్మెద, కోకిల చిత్రాలను - ఆయా పాత్రల చిహ్నాలుగా తమ వేషధారణలో ఉపయోగించుకొనవచ్చును

ప్రస్తావన:

ఆరంభంలో రైలు కూత బస్సు హారన్ టెలిఫోన్ మోత వినిపిస్తాయి తలుపు తీసిన చప్పుడవుతుంది రిక్షాల నడక

తరువాత కాసేపు నిశ్శబ్దం జోళ్ళ చప్పుడుతో పిల్లలు ప్రవేశిస్తారు నలుగురూ ఒక్కమాటుగా గుడ్‌మార్నింగ్' అంటారు తరువాత పాడతారు

బాల బృందం విరసించని మొగ్గల్లారా
చివురించని రెమ్మల్లారా
పులకించని గాలుల్లారా
లేవండోయ్ నిద్దరలెందుకు—
!గుడ్ మార్నింగ్

తెలి మబ్బుల ఎంజల్లారా
పసి పిందెల గింజల్లారా
గుడి లోపలి బొమ్మల్లారా
చూడండోయ్ చుట్టుపక్కలకు—
గుడ్ మార్నింగ్!

బాటల్లో మెరుపుల్లారా
ఆటల్లో ఉరుముల్లారా
పాటల్లో ఎరుపుల్లారా
కలపండోయ్ చేతులు చేతులు—
గుడ్ మార్నింగ్!

[చప్పట్లు వినిపిస్తాయి కిలకిల నవ్వుతారు బాలలంతా ఇంతలో కోకిల కూత, చిలుకల పలుకులు, పిల్లగాలి వీచిన ధ్వని వినిపిస్తాయి]

గాయనీ గాయకులు సుప్రభాతమ్మాయె సూర్యుండు వెలిగె
కొమ్మపై కోయంచు కోకిలలు కూసె!
చిలుకల పలుకులు చెవుల విందాయె
నేడుగాది యటంచు పాడిరి కవులు!

బాల బృందం నేడుగాది యటంచు పాడిరి కవులు!

గాయనీ గాయకులు చైత్ర మాసము వచ్చె చనియె శిశిరమ్ము
కొత్త చివురులు పట్టె కొమ్మ కొమ్మకును
పిల్ల తెమ్మెర సాగె బరబరా వచ్చి
నేడుగాది యటంచు పాడిరి ప్రజలు!

బాల బృందం నేడుగాది యటంచు పాడిరి ప్రజలు

గాయనీ గాయకులు — తీపి పులుపుల రుచులు వేప పూచేదు
చింత పచ్చడి చేసి విందుగా తినుచు
చక్కగా పంచాంగ శ్రవణమ్ము చేసి
నేడుగాది యటంచు పాడిరెల్లరును!

బాల బృందం — నేడుగాది యటంచు పాడిరెల్లరును

గాయనీ గాయకులు — మామిడి పూవుపై ముసరె భృంగములు
అణిగి మణిగిన పికము లరిచె గొంతెత్తి
వెడలి పోయె ప్రాతపడిన వత్సరము
మరియొక వర్షమ్ము తరలి వచ్చినది!

బాల బృందం — మరియొక్క వర్షమ్ము తరలి వచ్చినది!

(ఇంతలో చిలుకల కూతలు- తుమ్మెదల ఝుంకారాలు, కోకిలల కూజితాలు వినిపిస్తాయి)

బాల బృందం — ఎచ్చటికి ఓ చిలుక ఎగిరి పోవుతున్నావు
ముచ్చటవుతున్నదే వచ్చి మాటాడవే!

చిలుక — పచ్చగా నున్న ఆ పండ్లతోటకు పోదు
పంజరములో నన్ను బంధించవద్దు

బాల బృందం — ఎచ్చటికి తుమ్మెదా ఎగిరిపోతున్నావు
ఇంత చల్లని గాలి పీలుకుని ఈదుకుని!

తుమ్మెద — ఇప్పుడే పూసింది ఆ కలువపూదీగ
తేనె త్రాగే కోర్కెతో వేగుతున్నాను!

బాల బృందం — ఎచ్చటికి కోకిలా ఎగిరిపోతున్నావు
మ్రోళ్ళు చివురింపగా మ్రోగిపోతున్నావు!

కోకిల — మామిడాకుల మెరుపు మాయమైపోకుండ
వేయి ఆమడలైన వెళ్లిపోవలె నేను!

[చిలుక, తుమ్మెద, కోకిల వెళ్ళిపోతారు]

గాయనీ గాయకులు  ప్రపంచాన్ని మురిపించే వసంతాన్ని చూశావా
ఒయ్యారాలు కురిపించే వసంతాన్ని చూశావా

బాల బృందం  వసంతాన్ని చూశానోయ్
ఒక్కపాట రాశానోయ్

వచనం  ఏదీ ఆపాట పాడు ఏకోకిల నీ జోడు?

బాల బృందం  వసంతాన్ని చూశానోయ్
ఒక్కపాట రాశానోయ్
చల్లగాలి వచ్చినన్ను తాకి పోయింది
మల్లెమొగ్గ వచ్చి నన్ను చూసి నవ్వింది
పరిమళాలు మెచ్చి నన్ను కౌగిలించాయి—
మామిడాకు తింటున్నవి కోకిలమ్మలు
కొమ్మలెక్కి కూర్చున్నవి గోరువంకలు
ఊయాలలు ఊగుతున్నై రామచిలుకలు—
కేలండర్ పేజీల్లో కొత్త తేదీలు
కొట్టు కొట్టునిండా ఒక వేయిరంగులు
నిన్న లేని మొన్న లేని ఎన్నో షోకులు!

గాయనీ గాయకులు  చిన్నమావిచెట్టు ఒకటి చివురు పట్టింది
కోకిలమ్మ ఒకటి వచ్చి చిగురు మేసింది!

బాల బృందం  కోకిలమ్మ కోకిలమ్మ ఎప్పుడొచ్చావు
ఏడాదికి ఒక్కసారి ఎలాగొస్తావు
ఏదేశం చూసవచ్చి ఏమిటంటావు
నీరాగం వినిపిస్తే మీగడ చేదు
నీపాటలు వింటూంటే ఆకలికాదు
నీ గీతికి పంచదార పోలికరాదు

చివురాకులు తింటేనే గానమొస్తుందా
ఏదేదీ మమ్ముకూడ తినమంటావా
కుహూ కుహూ కుహూకుహూ అనమంటావా

ఒక్క ఋతువులో వచ్చే గాయక రాజా
ఏదేదీ మరోమాటు కొట్టుము బాజా
ఎన్నిమాట్లు విన్నా నీగేయం తాజా

గాయనీ గాయకులు    విచారాలు మరిపించే వసంతాన్ని చూశావా
ప్రపంచాన్ని మరిపించే వసంతాన్ని చూశావా

బాల బృందం    వసంతాన్ని చూశామోయ్
ఒక్కపాట పాడామోయ్

వచనం    ఏదీ ఏదీ ఆపాటా వినిపించండీ నే వింటా!

బాల బృందం    తుమ్మెదలం మనమంతా
తిరిగేద్దాం మనమంతా

గాయనీ గాయకులు    ఝుం ఝుం ఝుం ఝుం ఝుం ఝుం
నన నానా నన నానా

బాల బృందం    మామిడి పువ్వులు మనల్ని పిలిచాయ
నేరెడు వాసన మల్ని రమ్మందా
పనస తోటలా కబురంపాయ
అయితే పోదాం పదండి గలగల

గాయనీ గాయకులు    గలగల గలగల గలగల గలగల

బాల బృందం    తేనె తాగితే ఎంతో ఉత్సాహం
పాటపాడితే చాలా ఆనందం
రంగులు చూస్తే బెంగలు నహీ నహీ
అందుకే పోదాం పదండి చకచక

గాయనీ గాయకులు    చకచక చకచక చకచక చకచక

బాల బృందం    తాజా తేనెలు తరక్కు పోతాయ్
సెంటు వాసనలు గాలి కలుస్తాయ్

రేకుల రంగులు నేల వాలుతాయ్
త్వరగా పదండి పోదాం ఝుణఝుణ

**గాయనీ గాయకులు** ఝుణ ఝుణ ఝుణ ఝుణ ఝుణ
ఝుణ ఝుణ

[తుమ్మెదల రొదలు వాద్య సంగీతంలో వినిపించాలి]

**గాయనీ గాయకులు** పువ్వులతో ఈ చిరునవ్వులతో
పేరంటాలకు చేస్తారా
చుట్టరికాలకు వస్తారా

**బాల బృందం** పువ్వుల్లారా పువ్వుల్లారా
తీయండర్రా మూసిన తలుపులు

**పువ్వు** ఎవరు నువ్వు?

**తుమ్మెద రాణి** పేరంటానికి వచ్చిన దాన్ని
నల్లని రెక్కల తుమ్మెద రాణిని
పూయండర్రా పారాణి
ఝుం ఝుం ఝుం ఝుం ఝుం ఝుంకారం

**బాల బృందం** పువ్వుల్లా రా! పువ్వుల్లారా
పోయండర్రా తీయని తేనెలు!

**పువ్వు** ఎవరు నువ్వు?

**తుమ్మెదరాజు** విందు బువ్వకై వచ్చిన వాడ్ని
అల్లరి చెయ్యని తుమ్మెద రాజుని
చూడండర్రా ఇటుకేసి
టంటం టంటం ఝుంకారం

**వనపాలకులు** ఇలారండి ఇలారండి ఎవరండీ
ఈ తోటను చూసి పోండి ఇక్కడనుంచి

**గాయనీ గాయకులు** ఏమిటేమిటా బంగరు తోట
పాడండర్రా అత్తరు పాట

**బాల బృందం** ఎన్నో రంగుల చిరునవ్వులతో
నన్నే రమ్మంటున్నది తోట
తీయ దనము పొంగే తేనెలతో
వీటిని రమ్మంటున్నది తోట ।

అత్తరు వాసన పన్నీరులనే
అంతట జల్లిస్తున్నది తోట
పచ్చని ఆకుల కదలికలోనే
పాటలు వినిపిస్తున్నది తోట

చిన్నారి మొగ్గల నిద్దుర లేపే
చిరుగాలిని రమ్మన్నది తోట
బంగరు పువ్వుల బరువును మోసే
బాలికలను రమ్మన్నది తోట

**గాయనీ గాయకులు** ఆతోటలో ఉన్న అందాలవేమిటో
గంధా లవేమిటో విందాము చెప్పండి !

**బాల బృందం** చల్లగాలి పిల్లలు ! మల్లెపూల తల్లులు
పిల్లలతో తల్లులు ! తల్లులతో పిల్లలు !
చిగురాకుల త్లాజులు
పది రంగుల రాజులు
చిరుగాలుల నవ్వులు
జడపాయల పువ్వులు

ఎల తుమ్మెద చిందులు
కల కోకిల గొంతులు
మద హంసల నడకలు
గోరువంకల పలుకులు

ఎరయెర్రని పెదవులు
తెలతెల్లని నగ్గులు
నల నల్లని చూపులు
తియ తియ్యని కలుకులు

గాయనీ గాయకులు — తోటలు చూసిన పాపల్లారా
పాటల పువ్వుల మాటల్లారా
కదలని ఎర్రని పసుగులు
కారడవుల్లో మోదుగులు !

బాల బృందం — ఆ వసంతంలోన మేమొక
అడవి లోనికి పోయినాం
ఎచట చూస్తే అచ్చటే కని
పించె ఎర్రని పూల చెట్టులు !

వాటిమీదే చూపులన్నీ
వ్రాలుతుంటే అడిగివేశా
ప్రక్క నడచే పెద్ద తరగతి
బాలునొక్కని వైపు చూస్తూ

కుంకుమను తమ మీద జల్లుకు
కొమ్మ కొమ్మకు గోరువంకల
పిల్చి కూర్చొబెట్టుకున్నవి
వీని పేరేమి ?

నేను వేసిన ప్రశ్న వింటూ
తాను పెదవులు విప్పకుండా
చెట్టు నీడను ఉన్న శిలపయి
చెక్కె పేరును మిత్రుడు!

వాటి పేరే మోదుగుల్

గాయనీ గాయకులు — ఎర్రగా మోదుగుల్ పూసినాయంటే
తీయగా కోకిలల్ కూసినాయంటే

చల్లగా తెమ్మెరల్ వీచినాయంటే
తెల్లగా మల్లియల్ నవ్వినాయంటే
ఏమిటో ఏమిటో ఏమిటో పండుగ

బాల బృందం తుమ్మెదలూ గోరు వంకలూ
కోకిలలూ మావి పిందెలూ
మోదుగులూ మల్లెపూవులూ
చేసుకున్న పండుగ ఉగాది
కాలానికి పువ్వుల పునాది!



గాయనీ గాయకులు ఇదిగో ఇదిగో పగడాల ఉగాది
ఇదే ఇదే పసి వాళ్ల ఉగాది
పగడాల యుగాది
పసివాళ్ల యుగాది
ఇదిగో ఇదిగో ఇదిగో . . .



